# శ్రీ హనుమాన్ అవతార లీలా రహస్యము

## వైజ్ఞానిక విలువలు

రచన

తుమ్మల లక్ష్మయ్య



గ్రంథ అవిష్కరణ :

భౌతికము : శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ అలివేలు మంగాసమేత శ్రీ లక్ష్మి వెంకటేశ్వరస్వామి

ఆధ్యాత్మికము : శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ పద్మావతీ సమేత శ్రీనివాస్

వెల : రూ. 50/-

ప్రతులకు :

**తుమ్మల వెంకట కృష్ణారావు,**

రిమ్మనపూడి - 521 127.

పామర్రు మండలం, కృష్ణాజిల్లా.

**ఫోన్ : 08674 - 53297**

**శ్రీవాణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్,**

24-60/ఎ, రామానాయుడుపేట,

మచిలీపట్నం - 521 001.

**ఫోన్ : 21137, ఫ్యాక్స్ : 08672 - 26667**

గ్రంథకర్త :

**శ్రీ తుమ్మల లక్ష్మయ్య,**

పృథ్వీ పబ్లికేషన్స్

గుడ్లవల్లేరు, కృష్ణాజిల్లా.



# వందనం - అభివందనం

మాసిపోయిన మమత సమతలు
        మరచిపోయిన ప్రేమ కరుణలు
మరుగుపడిన మానవత్వం
        ఇలను మరల మేలుకొలుపగ
దివి నుండి భువికి దిగివచ్చిన
        ప్రేమమూర్తికి వందనం
కరుణామూర్తికి అభివందనం...



ఓం శ్రీ సాయిరాం

సత్యం శివం సుందరం



భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబా వారి
దివ్య పాదారవిందములకు ఈ గ్రంథము
అంకితము.

**తుమ్మల లక్ష్మయ్య**
*గ్రంథకర్త*

## సుందర పాలిత హనుమాన్



పై ఫొటోను భక్తితో సమర్పించిన వారు

**శ్రీ కంభంపాటి సూర్యప్రకాశరావు**

వారి

ధర్మపత్ని **ఊర్మిళా దేవి**

బొమ్ములూరు, బాపులపాడు మండలం,

కృష్ణాజిల్లా.

# మామిడి తోటలో మారుతి

వీరాంజనేయ పురం (కొండిపర్రు)

పామర్రు శివారు, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా.






“[illegible]సామ్రాట్”

**శ్రీ ఆరవల్లి నాగరాజు**

కొండిపర్రు **సిద్ధాంతి స్వామి**

పిన్-521 157. ఫోన్ : 08674-54036.




పై ఫోటోను భక్తితో సమర్పించిన

దాతలు

**శ్రీ సజ్జా సోమేశ్వరరావు,** వారి ధర్మపత్ని

**విజయరాజ్యలక్ష్మి,**

హైదరాబాద్.

## శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు గారు

(శ్రీవాణి సంపాదకులు, రాష్ట్ర ప్రధాన కార్యదర్శి A.P.T.&C.A.)

## వారి ధర్మపత్ని జయప్రద గార్ల సౌజన్యంతో...



* *Service to man is Service to God.*

* *Duty is God, Work is Worship.* - BABA



మహారాజ పోషకుల జనని, జనకులు పుణ్య దంపతులు

**కీ॥శే॥ శ్రీ తుమ్మల సుబ్బయ్య గారు, వారి ధర్మపత్ని సరస్వతమ్మ గార్లు.**

**జై జై జై హనుమాన గోసాయీ। కృపాకరో గురు దేవకీనాయీ** ఓ ఆంజనేయా నీకు జయమగు గాక. ఓ గురు దేవా మమ్మల్ని అనుగ్రహించు. ఎవరికి ఎవరు గురువు భగవంతుడే మార్గదర్శకుడూ, విశ్వగురువు కూడా. **పవన తనయ సంకట హరణ మంగళ మూరతి రూప। రామ లఖన సీతా సహిత హృదయ బసహు సురభూప** సంకట నాశకుడు, మంగళరూపుడు, దేవతాధిపతి, పవనతనయుడు అయిన నువ్వు శ్రీ సీతారామలక్ష్మణులతో కూడి సదా మా హృదయంలో ఆసీనుడవుకమ్మని ప్రార్థిస్తున్నాము..

## మహారాజ పోషకులు



### మనుమలు, మనమరాళ్ళతో

**శ్రీ తుమ్మల వెంకట కృష్ణారావు** గారు, వారి ధర్మపత్ని **ప్రభావతీ దేవి,**

మనుమడు **తుమ్మల తరుణ్,** మనుమరాళ్ళు **తుమ్మల అఖిల, తుమ్మల అంజలి.**

**కుమారులు :-**

**తుమ్మల సురేష్ చంద్ర ఛటర్జీ** M.E హైద్రాబాదు, **తుమ్మల రమేష్ చంద్ర ముఖర్జీ** M.B.A, విజయవాడ.

**తుమ్మల మహేష్ చంద్ర బెనర్జీ,** B.E (Industrial)

Soft ware, Projects, Programmes, Analyst, USA.,

HELP EVER HURT NEVER

## గ్రంథ కర్త దంపతులు



**శ్రీ తుమ్మల లక్ష్మయ్య వారి ధర్మపత్ని**
**లక్ష్మీశ్వరమ్మగార్లు**

- Love is God, God is Love, Live in Love.
- Compassionate heart is the temple of God - BABA



## ప్రియ తుమ్మల లక్ష్మయ్యగారు!

## అనేక మంగళాశాసనములు!

మీరు అందించిన 'శ్రీ హనుమాన్ లీలా అవతార రహస్యము 'అను పుస్తకాన్ని స్థాలీపులాక న్యాయముగా చూసాము. చాలా విషయాలు సేకరించి ఓ అందమైన కూర్పును చేయగలిగారు.

'హనుమ' ఇంతవరకు చరిత్రలో పరిచయమైన ఆశ్చర్యకరులయిన మహానుభావులలో శిరోభూషణము. శ్రీరామభక్తి గూడు కట్టుకొనిన మహనీయుడు. ఆతని భావమంతా శ్రీరాముని యందే తప్ప వేరు లేదు. ఈ విషయాన్ని శ్రీరామావతార సమాపన సమయములో తెలియ చేస్తారు

" స్నేహో మే పరమోరాజన్ ! త్వయి నిత్యం ప్రతిష్ఠితః॥
భక్తిశ్చ నియతా వీర! భావో నాఽన్యత్ర గచ్ఛతి॥"

ప్రజారంజకుడవు, ఆశ్రిత పారిజాతము అయిన శ్రీరామ నీ యందే, శ్రీరామ రూపనామము లందు మాత్రమే, నాకపరిమిత స్నేహము. దానిని విడచి క్షణకాలము కొనసాగలేను. నీ ఇతర అవతారములు గూడా నాభావనలో ఇమడలేవు. నీ యందుండే ప్రేమ వలన , నీ కంటే ఇతరమైన వన్నియు అసారములని గుర్తించితిని. అందుకే నీ యందు తగుల్కొనిన నా మనస్సు మరి దేనినీ స్మరించక , నీ యందే నిలచిపోయినది. శరీరమేమైనా కానీ, భావము మాత్రం నీవే ఆక్రమించు కున్నావు" అంటాడు. ఆనాటి నుండి ఈనాటికీ అదే రీతిలో ఉన్నట్టు శ్రీమద్భారతంలో, భీమ గర్వ భంగంలో తెలుస్తుంది. కానీ కలియుగంలో ఏర్పడ్డ పురాణాదుల వల్ల ఆ ప్రాచీన సిద్ధాంతానికి విఘాతం కల్గింది. ఎన్నెన్నో గాథలు బయలు దేరాయి. వాటివాటికి ఏవో ప్రమాణాలుంటాయి. ఎవరి మనః పరిపక్వతకి తగినట్లుగా వారికి అన్ని విషయాలు ఇవ్వాలని పెద్దలు గ్రహించి ఉందురు. వారందించిన వాటినన్నింటిని సులభంగా ఒక చోట చేర్చిన మీరు ధన్యులు. ఇది శ్రీరామభక్తిని విశేషముగ లోకంలో ప్రచారం చేసి ఆదర్శవంతముగ మనిషి జీవించగలిగేట్టు శక్తిని ఒసంగుగాక! సమసమాజాన్ని, సామరస్య సమాజాన్ని, వేదమార్గ ప్రతిష్ఠాపన సమాజాన్ని పెంపొందించుగాక !

జై శ్రీమన్నారాయణ

*పరమహంస పరివ్రాజకులు*

**శ్రీశ్రీశ్రీ చిన్న శ్రీరామానుజ జీయరు**

# శ్రీ హనుమద్వాక్యం గూర్చి మద్వాక్యం

శ్రీ హనుమాన్ అవతార (లీలా) రహస్యము అనే ఈ గ్రంధాన్ని శ్రీ హనుమాన్ చాలీసా కోటి పారాయణ యజ్ఞ పవిత్ర కార్యక్రమాలలో చదివే భాగ్యం కల్గింది. శ్రీమద్రామాయణ, పరాశర సంహితల యందలి స్వామి చరిత్రను మననం చేసికొనే అవకాశం కల్గినందుకెంతో సంతోషించాను.

**శ్రీ తుమ్మల లక్ష్మయ్య** గారు సంప్రదాయాభిమానంతో బాటు మంచి విచక్షణాజ్ఞానం కలవారు. కాబట్టి ప్రతి సత్సంప్రదాయాంశంలోని రహస్యాన్ని వెలికి తెచ్చే యత్నం చేసారు. వీరి రచనలన్నీ నేల విడిచి సాము చేసినట్లు కాక హేతుబద్ధంగా ఉంటాయి. నేటి కాలపు పిచ్చి పుచ్చు ప్రశ్నలకు తావీయ కుండని రీతిగా వీరి విశ్లేషణలుంటాయి. నేటి సమాజానికే విధమైన బోధన అవసరం. వీరి శిష్టవ్యావహారిక రచన కూడా ప్రశంసార్హంగా ఉంది.

ఇందులో హనుమంతునకు సంబంధించిన ముఖ్యవిషయాలందింప బడినాయి. స్వామి చరిత్ర అంతా సమీక్షింపబడింది. ప్రతి వారూ ఈ గ్రంధమును పఠించి శ్రీ హనుమంతుని దివ్య చరిత్రను గ్రహించి ఇందు అందింపబడిన మార్గంలో శ్రీ హనుమంతుని సేవించి కృతకృత్యులై, హనుమదనుగ్రహమునకు పాత్రులగుదురు గాక! హైందవ సంస్కృతి సంప్రదాయముల విలువలను ప్రకటింపగల రచనలింకను వీరి కలము నుండి వెలువడవలెనని ఆశించుచున్నాను. అందుకు తగిన ఆయురారోగ్య భాగ్యములు భగవంతుడగు శ్రీ హనుమంతుడు ఈ గ్రంధ రచయిత శ్రీ తుమ్మల లక్ష్మయ్యగారికి ప్రసాదింపగలందుకు ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

**హనుమత్సేవకుడు**

**అన్నదానం చిదంబరశాస్త్రి**

భాషాప్రవీణ, సాహిత్య విద్యా ప్రవీణ, వైద్య విద్వాన్

**వేటపాలెం,**

**22-2-99**

# ప్రకాశకుల మనవి

**శ్రీ హనుమత్ పాదసేవాదురంధరులారా!**

గ్రంధరచన ఒక అసిధారావ్రతం. అందునా హనుమత్స్వామి వంటి దివ్యశక్తులు గల తపస్సంపన్నుని అవతారమూర్తి యొక్క సంపూర్ణ చరిత్ర వ్రాయడం అంటే మరీను. ఆ మహాతేజశ్శాలి మారుతి రామభక్తి, కార్యదీక్ష, శక్తియుక్తుల సూత్రీకరణలో ఈ గ్రంధంలో గ్రంధకర్త అకుంఠిత దీక్షా, దక్షతలు వెల్లడి చేస్తున్నాయి.

ఇట్టి గ్రంధ రచనకు కేవలం భాష మాత్రమే చాలదు. అసామాన్యమైన భక్తి ప్రేరణతో కూడిన ఆధ్యాత్మిక తత్త్వ జ్ఞాన విచార సమగ్ర దృష్టి గ్రంధకర్త కలిగియుండాలి. అవి నిండుగా కలిగి యుండుట వలననే కృతికర్త శ్రీ తుమ్మల లక్ష్మయ్యగారు ఈ అమూల్యగ్రంధము వ్రాయగలిగినారు. ఈ గ్రంధములో మన సంస్కృతి, సాంప్రదాయాలు, వైజ్ఞానిక విలువలతో ఎంతో చక్కగా వివరించారు. చదవడం మొదలు పెడితే సామాన్య విద్యా విజ్ఞానం కలిగిన వారిని సైతం అంతా చివరిదాకా చదివించగల శక్తి ఈ గ్రంధానికి ఉన్నదనడం ఏ మాత్రం అతిశయోక్తి కాదు.

వీరి లేఖిని నుండి భారతీయ సంస్కృతిని, ధర్మాలను ప్రకాశింపజేయు గ్రంధములు ఇతోధికముగా వెలువడగలవని ఆశిస్తూ వారికి మా అభివందనములు తెలియజేయుచున్నాము. శ్రీ ఆంజనేయస్వామివారి పరమ పావన చరిత్రను ప్రచురించి విశేష ప్రచారం చేసే సదవకాశాన్ని మాకు కలుగచేసిన శ్రీ తుమ్మల లక్ష్మయ్య గారికి మా హృదయపూర్వక ధన్యవాదములు. స్వామి కల్గించిన సంకల్పం మేరకు వారు వ్రాసిన ఈ గ్రంధాన్ని మీకు అందజేస్తున్నాము. మీరు సద్వినియోగం గావించుకొని స్వామి వారి అనుగ్రహానికి పాత్రులు కాగలరని విశ్వసిస్తున్నాము. ఇది హనుమదాజ్ఞ.

**- లిమ్మనపూడి వెల్ఫేర్ అసోసియేషన్**

# విజ్ఞాపన

ప్రపంచం మొత్తంలోనే అత్యంత ప్రాచీనమైనది భారతీయ సంస్కృతి. భారతీయ ఆధ్యాత్మిక చింతనకు ఆధారం వేదాలు, ఉపనిషత్తులే. ఈ విశ్వం, మానవజీవనం, ఆత్మ, పరమాత్మ, పునర్జన్మ, మోక్షం మొదలైన ఆధ్యాత్మిక సమస్యలకు సమాధానాలు భారతీయ సంస్కృతి ఇవ్వగలుగుతుంది. వేదాలు ఉపనిషత్తులలో ఉన్న ప్రగాఢమైన ఆధ్యాత్మికతను పురాణ సాహిత్యం సూర్యరశ్మిలా ప్రపంచానికి పరివ్యాప్తం చేస్తుంది. అట్టి అద్భుత శక్తివంతమైన పురాణ సంస్కృతి నుండి ఉద్భవించిన ఫలమే పవన సుతుని పవిత్ర చరిత్ర.

మన దేశంలో రామాలయం గాని , హనుమంతుని గుడిగాని లేని గ్రామం లేదు. శ్రీరాముడు తమ ఇలవేల్పు అయిన కారణంగా ఆంధ్రులు ఆంజనేయుని మరింత భక్తి శ్రద్ధలతో ఆరాధిస్తున్నారు. సకల సద్గుణ విలసితుడు, అలౌకిక శక్తిసంపన్నుడు, సకల విద్యావేత్త, వ్యవహార దక్షుడైన దూత, భక్తి, శక్తి, యుక్తులను త్రివేణి సంగమంలా సంతరించుకొన్న శ్రీ ఆంజనేయుని జీవితమే ఒక సందేశం. ఆ మహాజ్ఞాని హనుమంతునిలో మూర్తీభవించిన అన్ని గుణగణాలు పరాకాష్ఠకు చేరుకొని పరిపూర్ణ స్థితిలో గోచరిస్తున్నాయి. శ్రీరాముని నమ్మిన బంటుగా ప్రభువుతో సమానంగా పూజలందుకుంటున్న అసాధారణ సేవకుడాయన.

కొలిచేవారి కొంగు బంగారంలా కోరిన వరాలిచ్చే అద్భుత శక్తులు గల ఆ మహాతేజో వంతుడు ఆంజనేయుని దివ్యచరిత్ర భక్తులకు అందించుటయే నా ఈ పుష్ప వికాసము.

ఈ పుష్ప వికాసమునకు తోడ్పడిన గ్రంథములు రామాయణము, మహాభారతము, పరాశర సంహిత, మహాత్ముల వ్యాసాలు, సద్గురువుల బోధనలు. నా వ్రాత ప్రతిని అచ్చుకు అనుకూలముగా వ్రాసి యిచ్చిన మా మనుమరాలు కుమారి తుమ్మల ప్రత్యూషకు నా ఆశీస్సులు.

నా గ్రంథ రచనకు సహకారాన్ని, సలహాలను ఇచ్చి నన్ను ప్రోత్సహించిన నా సహధర్మచారిణి శ్రీమతి లక్ష్మీశ్వరమ్మకు నా కృతజ్ఞతాశీస్సులు. నా ఈ పుష్పాన్ని ఆఘ్రాణించి తమ శుభాకాంక్షలు, అభిప్రాయాలు అందించిన పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామి వారి పాదపద్మములకు నా హృదయపూర్వక శతసహస్ర నమస్కారములు.

డా॥ అన్నదానం చిదంబర శాస్త్రి, భాషా ప్రవీణ, సాహిత్య విద్యాప్రవీణ, వైద్యవిద్వాన్ గార్కి నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

మీ ఆత్మీయుడు

తుమ్మల లక్ష్మయ్య

# విషయ సూచిక



# శ్రీ ఆంజనేయ సుప్రభాతము

అమల కనక వర్ణం ప్రజ్వల త్పావకాక్షం
సరసిజని భవక్త్రం సర్వదా సుప్రసన్నం
పటుతర ఘన గాత్రం కుండలాలం కృతాంగం
పరజయ కరవాలం రామదూతం నమామి॥

అంజనా సుప్రజా వీర పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ హరి శార్దూల కర్తవ్యం దైవమాహ్నికం
ఉత్తిష్ఠోత్తిష్ఠ హనుమాన్ ఉత్తిష్ఠ విజయ ధ్వజ
ఉత్తిష్ఠ రవిజాకాంత త్రైలోక్యం మంగళం కురు॥

శ్రీరామ చంద్ర చరణాంబుజ మత్తభృంగ
శ్రీరామ మంత్ర జప శీల భవాబ్ధి పోత
శ్రీ జానకీ హృదయ తాప నివారమూర్తే
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

శ్రీరామ దివ్య చరితామృత స్వాదలోల
శ్రీరామ కింకర గుణాకర దీనబంధో
శ్రీరామ భక్త జగదేక మహోగ్రశౌర్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

సుగ్రీవ మిత్ర కపిశేఖర పుణ్యమూర్తే
సుగ్రీవ రాఘవ సమాగమ దివ్యకీర్తే
సుగ్రీవ మంత్రివర శూరకులాగ్రగణ్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

భక్తార్తి భంజన దయాకర యోగివంద్య
శ్రీ కేసరీ ప్రియతనూజ సువర్ణదేహ
శ్రీ భాస్కరాత్మజ మనోంబుజ చంచరీక
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥





శ్రీ మారుతి ప్రియ తనూజ మహాబలాఢ్య
మైనాక వందిత పదాంబుజ దండితారిన్
శ్రీ ఉష్ట్ర వాహన సులక్షణ లక్షితాంగ
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

పంచాననస్య భవభీతి హరస్య రామ
పాదాబ్జ సేవన పరస్య పరాత్పరస్య
శ్రీ అంజనాప్రియ సుతస్య సువిగ్రహస్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

గంధర్వ యక్ష భుజగా ధిప కిన్నరాశ్చ
ఆదిత్య విశ్వ వసురుద్ర సువర్ష సంఘాః
సంకీర్త యంతి తవ దివ్య సునామ పంక్తిం
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

శ్రీ గౌతమీ చ్యవన తుంబుర నారదాత్రి
మైత్రేయ వ్యాస జనకాది మహర్షి సంఘాః
గాయంతి హర్ష భరితాస్తవ దివ్యకీర్తిం
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

భృంగావళీ చమకరందరసం పిబేద్వై
కూజం త్యుతార్థమధురం చరుణాయుధాశ్చ
దేవాలయే ఘన గభీర సుశంఖ ఘోషాః
నిర్యాంతి వీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

పంపా సరోవర సుపుణ్య పవిత్ర తీర్థ
మాదాయ హేమకలశైశ్చ మహర్షి సంఘాః
తిష్ఠంతి త్వచ్ఛరణ పంకజ సేవనార్థం
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్ ॥

శ్రీ సూర్య పుత్ర ప్రియనాథ మనోజ్ఞ మూర్తే
వాతాత్మజాత కపివీర సుపింగళాక్ష
సంజీవరాయ రఘువీర సుభక్తవర్య
శ్రీ వీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥



# శ్రీ ఆంజనేయ స్వామి వారి పూజాఫలము

శ్రీ హనుమ ద్వైతాద్వైత విశిష్టా ద్వైతములను భేదము లేక సర్వ మానవులకు సమారాధ్యుడు.

హనుమ సాక్షాత్ పరబ్రహ్మం.

పురుషసూక్తములో 'త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుష ః' అను వాక్యమున్నది. హనుమత్సహస్రనామాలలో 'త్రిపాదూర్ధ్వగాయ నమః' అనునదొక నామము. దానిని బట్టి యతడు వేదవేద్యుడు పురుషాపరనాముడైన పరబ్రహ్మమని కూడా తెలియుచున్నది. శ్రీమద్రామాయణమున నాతడు వేదవేత్తయనియు సర్వ వ్యాకరణవేత్త యనియు చెప్పబడింది.

శ్రీ హనుమంతుడు రుద్రాంశ సంభూతుడు

శివుడే ఆంజనేయుడుగా జన్మించినట్లు శివుడు స్వయంగా పార్వతీదేవితో చెప్పాడు.

మదంశ జో మహాభాగో మహాబల పరాక్రమః
సు భగః సుందర శ్శూరః శ్రీమాన్ భక్త పరాయణః

దేవి, నా యంశతో పుట్టేనరుడు మహాతేజశ్శాలి, మహాబల పరాక్రమవంతుడు, సౌభాగ్యవంతుడు, సుందరుడు , శూరుడు, భక్తవత్సలుడు కాగలడని శివుడు పార్వతితో చెప్పాడు.

హనుమ సృష్టి స్థితి లయకారకుడు

శ్లో॥ నాద బిందు కలాతీతం, ఉత్పత్తి లయ వర్జితమ్।
సాక్షాదీశ్వర రూపంచ, హనుమంతం నమామ్యహమ్॥ (పరాశరసంహిత)
హనుమ సృష్టి స్థితి లయకారకుడు, సాక్షాత్తు ఈశ్వరుడు

శ్లో॥ ఆరాధితే కపిశ్రేష్ఠే, సమస్తా అపిదేవతాః।
భవంతి సతతంతుష్టాః సర్వదేవాత్మకోహిసః ॥ ( పరాశర సంహిత)

హనుమ సర్వదేవతా స్వరూపుడు గావున ఆయనను పూజిస్తే సర్వ దేవతలను పూజించిన ఫలితం వస్తుంది. హనుమద్భక్తులు ఎల్లప్పుడూ సర్వ సౌఖ్యాలు అనుభవిస్తారు.

శ్లో॥ దీర్ఘమాయూర్థ ఖేత్రైషర్యతో విజయోభవేత్
మార్వాది ఖూత సంక్షోభస్తద్దేశేనైన జాయతే॥

హనుమదుపాసన చేసిన వారంఁదరు దీర్ఘాయుష్మంతులై ఉంటారు. సమస్త విజయాలు సిద్ధిస్తాయి. అపమృత్యుభయం ఉండదు.

శ్లో॥ యస్తు గేహే హనూమంతం భక్తా నిత్యం ప్రపూజయేత్।
తద్గృహేతత్ప్రభావేన నిత్యం లక్ష్మిఉ చంచలా॥ (సుదర్శన సంహిత)

ఏ ఇంట్లో ప్రతి నిత్యం భక్తితో హనుమంతుని పూజిస్తారో ఆ ఇంట్లో హనుమ ప్రభావము వల్ల లక్ష్మి స్థిరంగా ఉంటుంది.

శ్రీ హనుమత్స్వామి శ్రీ సీతా రామ పాద సేవా దురంధరుడు, సర్వదేవతా స్వరూపుడు, జగద్గురువు, సర్వ శక్తి ప్రదాత, భక్త సులభుడు.

త్రిమూర్తులలో ఒకరి కున్న శక్తులు మరొకరికి లేనందున బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరులు కూడా వారి ముగ్గురి దివ్యశక్తులూ కేంద్రీకరించియున్న శ్రీ ఆంజనేయ స్వామిని పూజించి, ధ్యానించి , సేవించి అభీష్టాలు నెరవేర్చు కుంటారు.

శ్రీరామ చంద్రుడే హనుమదుపాసన చేసినట్లు సుందరకాండ, ఉత్తర కాండలలో వచనాలున్నాయి. సీతా మాత ప్రతి మంగళవారము భక్తిశ్రద్ధలతో హనుమంతుని పూజించేది.

శ్రీకృష్ణుడు హనుమద్వ్రతం చేసి శ్యమంతకమణిని, సత్యభామను పొందాడు. పాండవులు హనుమంతుని సేవించి విజయం పొందారు. శ్రీ ఆంజనేయ స్వామిని సేవించే వారికి భోగ, మోక్షాలు రెండు కరతలామలకాలు.

శ్రీ హనుమత్స్వామి వారి వ్రతాలు, పూజలు, భజనలు చేయటం, వారి మంత్రాలను జపించటం వల్ల మానవులకు ఇహపరాలు, సుసాధ్యాలు. వారికి సర్వకార్యాలు సిద్ధిస్తాయి. 'సర్వకార్య సిద్ధిపరుడు'. వీరిని మించిన దైవం భూతలంలో లేరు. వీరి పూజ వల్ల సర్వదేవతా పూజాఫలం లభిస్తుంది.

శ్రీ హనుమత్స్వామి ప్రత్యక్ష దైవము. సులభముగ ప్రసన్నుడగును. పొగిడిన కొలది పెరిగి, కోరిన కోరికలు తీరుస్తాడు.

ముఖ్యంగా సంతులేనివారు భక్తితో కొలచిన తప్పక సంతు కలుగుతుంది. భార్య,భర్తలు అన్యోన్యత లేనివారికి ప్రేమానురాగాలతో పొత్తు కుదురుతుంది. దీర్ఘవ్యాధులతో బాధపడేవారికి సంపూర్ణ ఆరోగ్యం చేకూరుతుంది. ఋణములతో బాధపడేవారికి సర్వసంపదలు కలుగును. ఉద్యోగము లేని వారికి మంచి ఉద్యోగము వచ్చును. వ్యాపారస్తులకు ఒడుదుడుకులు లేకుండా సక్రమంగా వ్యాపారము జరుగును. రాజకీయ నాయకులకు ఎట్టి ఉపద్రవములు లేకుండా పదవి లభించును.

హనుమత్స్వామి సీతామాతను దర్శించిన శుభదినము మంగళవారము. స్వామి జన్మదినమగు శనివారము హనుమజ్జయంతి వైశాఖ బహుళ దశమినాడు మార్గశిర త్రయోదశి హనుమత్ వ్రతమునాడు పూజించిన విశేష పుణ్యము లభించును.

ప్రతి నిత్యము స్వామిని పూజించేవారికి ధన, కనక, వస్తువాహన, ఆయురారోగ్య పుత్ర పౌత్రాభివృద్ధి కలుగును.

## హనుమత్పూజా ద్రవ్యములు :

**పుష్పములు :**

పారిజాతములు, తామర, కలువ, మొగలి, జాజి, మల్లెలు, నంది వర్ధనలు, గజనిమ్మ, ఎఱ్ఱ గన్నేరు, మందారాలు, సంపెంగ, కనకాంబరాలు, జిల్లేడు, మెట్టతామర, చంద్రకాంత, సువర్ణ పుష్పములు.

**పత్రములు :**

తమలపాకులు, మారేడు, తులసి, ఉసిరి, గరిక, చిమ్మ, తామర, మామిడి, నేరేడు, రుద్రజడ, ఉత్తరేణి, మర్రి, మాచి పత్రములు.

**పండ్లు :**

అరటి, మామిడి, పనస, నిమ్మ, చింత, వెలగ, ఖర్జూర, నేరేడు, రేగు, దానిమ్మ, ద్రాక్ష, సీతాఫలము, కొబ్బరికాయ.

**పంచ సంఖ్య :**

ఆంజనేయస్వామికి అయిదు సంఖ్య ఇష్టము. హనుమత్ప్రీతి కొరకు పుష్పఫలపత్రములు, తాంబూలములు, పుష్పములు పంచ సంఖ్యలో సమర్పించాలి. ప్రదక్షిణ నమస్కారములు ఐదేసి చేయుట శ్రేష్టము.

## హనుమత్ప్రదక్షిణములు :

భూత, ప్రేత, పిశాచాది బాధలు తొలగుటకు, రోగములు ఎట్టి కష్టములైన తొలగుటకు అభీష్టసిద్ధికి ఆంజనేయ ప్రదక్షిణములు సుప్రసిద్ధములు. అనేకులు ఆ ప్రదక్షిణముల వలన కృతకృత్యులగుచున్నారు. పసుపు కొమ్ములు వాడుట శ్రేయస్కరము.

శ్రీ హనుమాన్ జయ హనుమాన్ జయజయ హనుమాన్

శ్లో॥ ఆంజనేయం మహావీరం బ్రహ్మ విష్ణు శివాత్మకం
తరుణార్క ప్రభంశాంతం రామదూతం నమామ్యహమ్ ॥

శ్లో॥ మర్కటేశ మహోత్సాహ సర్వశోక వినాశన
శత్రుసంహార మాంరక్ష శ్రియందాపయ - మేప్రభో"

అని పఠించుచు భక్తిశ్రద్ధలతో ప్రదక్షిణములు చేయవలయును.

హనుమద్వ్రతము :

హనుమంతుని ముఖ్యమగు పర్వదినాలలో ఇది ఒకటి. మార్గశిర శుద్ధ త్రయోదశినాడు హనుమ లంకలో సీతాదేవిని సందర్శించాడు. కావున ఆ రోజున హనుమద్వ్రతము చేస్తారు. ఇది సహజంగా డిశెంబరు నెలలో వస్తుంది. ఒక్కరు గాని, దంపతులుగాని, సామూహికంగాగాని వ్రతం చెయ్యాలి. వ్రతం జరుపుకున్న ఆనాడు స్వామికి విశేష పూజ అయినా చెయ్యాలి.

హనుమద్వ్రత విధానము అను గ్రంథమును డా॥ అన్నదానం చిదంబర శాస్త్రి గారు విపులంగా వ్రాశారు. గ్రంథం చూచి ఏ పురోహితులైనా చేయించగలరు.

## హనుమ జన్మ లీలా రహస్యము

హనుమత్స్వామి జనన విషయంలోను, జనన కాలం విషయంలోను పురాణాంతరాలలో అనేక గాథలున్నవి. కానీ ఆంజనేయస్వామి చరిత్ర ప్రధానమైన పరాశర సంహితలో ఇలా వున్నది.

రాక్షసులు బలగర్వంతో దేవేంద్రాది దేవతలను, మహర్షులను బాధించుచున్నారు. వారిని సంహరించటానికి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు లెవ్వరు సమర్థులు కాకపోవుటచే విష్ణువు తమ ముగ్గురు తేజస్సు సర్వదేవతల

తేజస్సు కలిపి శివునకు ఇచ్చాడు. ఈశ్వరుడు ఆ తేజస్సును మ్రింగాడు. ఈ తేజస్సు ఫలితంగా జన్మించినవాడు రాక్షస సంహారం చేసి దేవతలను, మునులను అందరినీ ఆనందింపచేస్తాడని విష్ణువు చెప్పాడు.

ఆ తేజః పిండాన్ని తన భార్య పార్వతి గర్భంలో ప్రవేశపెట్టాడు పరమ శివుడు. ఆమె దానిని భరించలేక అగ్నిలో విడిచేసింది. అగ్నిహోత్రుడు కూడా భరించలేక దానిని వాయుదేవునకు ఇచ్చాడు.

శాపగ్రస్తురాలైన పుంజిక స్థల అనే అప్సరస వానరశ్రేష్ఠుడైన కుంజరునుకి పుత్రికగా జన్మించింది. ఆ కుంజర వానరుడామెకు అంజనయని పేరు పెట్టి పెంచి తన మేనల్లుడైన కేసరినకిచ్చి వివాహము చేసాడు. అంజనా కేసరులు సంసారం చేస్తుండగా వారికి పుత్ర వాంఛ కలిగింది. ఆ సమయంలో ధర్మ దేవత అంజనీ దేవికి కలలో సాక్షాత్కరించి నీకు లోకారాధ్యుడైన కుమారుడు జన్మిస్తాడు. నువ్వు వాయుదేవుణ్ణి గురించి తపస్సు చెయ్యి! అని చెప్పింది. ఆ విషయాన్ని భర్తకు చెప్పగా అతడానతీయ ఆమె సంతాన వాంఛతో వాయు దేవత్మాకమైన మంత్రాన్ని జపిస్తూ తపస్సు ప్రారంభించింది.

వాయు దేవుడు ప్రతిరోజు ఆహారం నిమిత్తము ఆమె చేతిలో ఒక పండు ఉంచేవాడు. దానితో ఆమె ఆకలి తీరేది. కొంత కాలానికి వాయుదేవునకు ఆమె యెడ అనుగ్రహం కలిగి పండు మాదిరిగా దివ్యమైన శివ వీర్యాన్ని అంజనీ దేవి చేతిలో పెట్టాడు. పండు అనుకొని ఆమె దానిని తిన్నది. ఫలితంగా గర్భం ధరించింది.

వైశాఖ బహుళ దశమీ శనివారం పూర్వాభాద్ర నక్షత్రయుక్త వైధ్యుతి నామక యోగ సహిత మధ్యాహ్న సమయంలో మణిమయ కుండలాలతో, దివ్య పీతాంబరంతో, హేమమాలలతో, స్వర్ణయజ్ఞోపవీతంతో, మణిమాపురాలతో, ధ్వజవజ్రాఛత్ర పద్మరేఖలతో కూడిన పాదపద్మాలతో, మహాభుజాలతో, దీర్ఘవాలంతో బ్రహ్మతేజః పుంజవిలసితవదనారవిందంతో మహాబలసంపన్ను డయిన విష్ణు భక్తి తత్పరుడు నిగ్రహానుగ్రహసమర్ధుడు. మహామహిమాన్వితుడు, సర్వశుభలక్షణ సంపన్నుడు అయిన కుమారుడు అంజనాదేవి గర్భం నుండి ఆవిర్భవించాడు.

ఆ సమయంలో దేవతలు పువ్వుల వాన కురిపించారు. గంధర్వులు గానం చేసారు. విద్యాధర కిన్నెర కింపురుషాదులు ఆనందంతో నాట్యం చేసారు.

రాక్షసేశ్వరుల కిరీటాలలో మణులు రాలిపోయినాయి. దేవతలు, మహర్షులు మహదానందం చెందారు.

## బాలహనుమంతుడు సూర్యుని ఫలమనుకొని మ్రింగబోవుట

అవతరించిన ఐదారు రోజులలోనే అంజన తనయుణ్ణి ఇంటివద్దనే విడచి పువ్వుల కోసం అడవికి వెళ్ళింది. అంతకుముందే కేసరి కార్యార్థమై బయటకు వెళ్ళాడు. బాలునకు అపారంగా ఆకలి వేసినది. అటూ ఇటూ చూచాడు కాని బాలునకాహారము యేమి దొరకలేదు. చివరికి అతని దృష్టి సూర్య బింబం మీద పడింది. ఉదయిస్తున్న సూర్యుని చూచి పండు అనుకొని ఆ పండు తినాలని సూర్య మండలానికి ఎగురసాగాడు. ఆదిలోనే వాయుదేవుడు అతనికి ఎగిరే శక్తి ప్రసాదించాడు.

ఆ వాయునందనుడు తీవ్ర వేగంతో అంతరిక్షంలో ఎగురుతున్నాడు. ఆ వేగాన్ని తిలకించిన దేవ, దానవ, యక్ష, కిన్నెర, కింపురుష, గణాలన్నీ ఆశ్చర్యం చెందుతున్నారు. తన బిడ్డ సూర్యునకేసి ఎగరటం చూచి మార్తాండుని తీక్ష్ణ కిరణజ్వాలల్లో అతడు దగ్ధం కాకుండా వాయుదేవుడు హిమాచలమలయాచలాల నుండి శీతలత్వాన్ని గైకొని కుమారుని వెంట ఎగురసాగాడు.

ఆ రోజు గ్రహణ దినం కావటం వల్ల రాహువు నియమానుసారంగా సూర్యుని మ్రింగటానికి వచ్చాడు. సూర్యుని రథం మీద అప్పటికే వానర బాలుడు కూర్చున్నాడు. రాహువు రావటం చూచిన ఆ వానర బాలునకు ఆకలి విషయం జ్ఞాపకానికి వచ్చింది. దానితో అతడు రాహువుపై విరుచుకు పడ్డాడు. ఆ బాలుని తేజస్సుకు రాహువు దడదడలాడి పోయాడు. మహేంద్రుని తనను రక్షించ వలసినదిగా ప్రార్థించాడు. అప్పుడు మహేంద్రుడు ఐరావతారూఢుడై రాహువును కాపాడటానికి మహావేగంతో వచ్చాడు. ఐరావతాన్ని చూస్తునే ఆ వానర బాలుడు రాహువును వదలిపెట్టి ఐరావతాన్ని పట్టుకొనుటకు వెళ్ళగా దేవేంద్రుడు కోపించి తన వజ్రాయుధంతో బాలుని ఎడమ దవడపై కొట్టాడు. ఆ దెబ్బకు బాలుని దవడ విరిగిపోయింది. అతడు పర్వతం మీద పడి విలవిలలాడ సాగాడు.

తండ్రి వాయువునకు కోపం వచ్చి ముల్లోకాలలో సంచరించలేదు. జగత్త్రయంలో వాయువు సంచారము లేక యేది కదలటంలేదు. అందరి

శ్వాసకార్యం ఆగిపోయింది. ముల్లోకవాసులు భయభ్రాంతులయ్యారు. దేవేంద్రుడు కూడా భయంతో బ్రహ్మవద్దకు వేగంగా వెళ్ళి జరిగిన సమాచారమంతా వివరించి చెప్పాడు. అంత బ్రహ్మ దేవేంద్రాది దేవతలతో ఆ పర్వత గుహవద్దకు వెళ్ళి బాలుని స్పృశించేసరికి బాలవానరుడు బాధలు తొలగి మహానందంతో లేచాడు. అప్పుడు వాయుదేవుడు పరమానందం చెందాడు. అంతే జగత్త్రయంలో ప్రాణ వాయువు సంచారం జరిగింది.

## హనుమంతుడు అద్భుత దివ్యశక్తులు పొందిన లీల

బ్రహ్మ సురలతో "ఈ బాలుడు దేవకార్య సిద్ధ్యర్థము అవతరించాడు. కావున దేవతలందరు వరాలు ప్రసాదించాలి" అన్నాడు.

దేవేంద్రుడు ఆనందంతో నా వజ్రాయుధం వల్ల యితని హనువు భగ్నమైంది కనుక ఇతడు హనుమంతుడని పిలవబడగలడు. నా వజ్రాయుధం వల్ల యితనికి ఏ అపాయము కలుగదన్నాడు. దవడ వజ్రాయుద్ధం వల్ల కొట్టబడియు నిగ్రహించినాడు కనుక హనుమాన్ - హనుమంతుడయ్యాడు. సూర్యభగవానుడు అనుగ్రహిస్తూ నా శతాంశ తేజాన్ని యితనికిస్తున్నాను. నా శక్తితో యితడు తన రూపాన్ని అభీష్టానుసారము మార్చుకొనగలడు. యితనికి సర్వశాస్త్రాలు అధ్యయనము చేయిస్తాను. శాస్త్ర జ్ఞానంతో యితనికి సాటి ఎవ్వరు ఉండరు. అద్భుతమైన వక్తృత్వం వీనికి లభిస్తుందంటూ సూర్యుడు చెప్పాడు. "జలసంబంధంగా యెట్టి భయము యితనికి ఉండదని వరుణదేవుడన్నాడు. ఇతనికి రోగం అంటూ వుండదు. యమ దండంతో యితనికి భయంలేదు" అని యముడు అన్నాడు. ఈ బాలకుడు చిరంజీవిగా ఉంటాడని విశ్వకర్మ చెప్పాడు. బ్రహ్మ వరాలిస్తూ ఈ బాలుడు బ్రహ్మజ్ఞానియై చిరాయువై బ్రహ్మాస్త్రంతో వీనికి మరణ భయంలేదని ఆశీర్వదించాడు. దేవతలందరు బాల హనుమంతునకు దివ్యమైన వరాలిచ్చారు.

## బాల్య క్రీడలు - శాపము

పవన సుతుడు బాల్యంలో చాలా అల్లర్లు చేసేవాడు. అసలే వానరుడు అదీగాక దేవతల వల్ల వరాలు పొందిన మహాబలవంతుడు. మహర్షుల కమండ లోదకాలను పారబోసేవాడు. వారి ఆసనాలు ఎత్తుకుపోయి చెట్టు కొమ్మలకు

వ్రేలాడదీసేవాడు. అంగ వస్త్రాలను చింపేవాడు. వారి గడ్డాలు పీకేవాడు, పాత్రలు పగులగొట్టేవాడు. దేవతల వర ప్రభావంతో వారు ఏమి చేయలేకపోయేవారు. తల్లిదండ్రులు ఎంత ప్రయత్నించినా అతని చేష్టలు వదిలించలేకపోయారు.

చివరకు భృగు మహర్షి "వానరా! నీ బల దర్పంతో మమ్ములను బాధిస్తున్నావు. నువ్వు నీ బలాన్ని మరచిపోయెదవుగాక, ప్రక్కవాడు జ్ఞాపకానికి తెచ్చినప్పుడే, ప్రేరణ నిచ్చినప్పుడే నీవు నీ బలాన్ని స్మరించుకొని స్వశక్తిని సద్వినియోగము చేసెదవుగాక" అని అనటంతో హనుమంతుడు వెంటనే తన బలాన్ని మరచిపోయాడు.

## స్వామి వారి నామ మహిమ

బుద్ధిర్బలం యశో ధైర్యం
నిర్భయత్వమ రోగతా
అజాడ్యం వాక్ పటుత్వంచ
హనుమత్ స్మరణాత్ భవేత్ ॥

హనుమంతుని స్మరిస్తే బుద్ధి, శరీరబలం, యశస్సు, చెదరని ధైర్యం, ఎవరి వల్ల భయపడక పోవటమూ, ఆరోగ్యము కలుగుట, పనిలో చురుకుదనం, వాక్కు యొక్క సామర్థ్యం కలుగుతాయని ప్రమాణం వుంది. కేవలం పేరును స్మరిస్తేనే అంతటి శక్తి ఉన్నప్పుడు వారి ఆరాధనలో ఎంత మహత్తు దాగి ఉందో కదా!

అంజనా గర్భసంభూతుడు కావటం వల్ల ఆంజనేయుడని, కేసరి క్షేత్ర జాతుడగుటచే కేసరీ పుత్రుడనీ, శివాంశజుడు కావటం వల్ల శివనందనుడని, రుద్రవీర్య సముద్భవుడని, వాయువు వల్ల అవతరించటం వల్ల వాయు నందనుడని, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల తేజస్సు వల్ల అవతరించినాడు కావున త్రిమూర్త్యాత్మకుడని, సర్వదేవతల తేజస్సు కూడా ఉండటం వల్ల సర్వదేవతా త్మకుడనీ ప్రసిద్ధి చెందాడు.

## హనుమ వాహనము

హనుమంతుని వాహనము ఉష్ట్రము. అనగా ఒంటె. స్వామి ధ్వజ చిహ్నం కూడా ఒంటె.

# శ్రీ హనుమాన్ విద్యాభ్యాస వైశిష్ట్యము

వాయునందనుడు సూర్యభగవానుని సర్వశాస్త్రాలు ఉపదేశింప వలసినదిగా కోరాడు. అప్పుడు సూర్యుడు నేను నిర్విరామంగా పరిభ్రమిస్తూ ఉంటాను గదా! స్థిరంగా కూర్చుని నీకు విద్యాభ్యాసం చేయటం నావల్ల కాదు అన్నాడు. అంత హనుమంతుడు స్వామి! మీ సంచారమునకు ఆటంకం కలగ కుండా అధ్యయనము చేస్తానని పూర్వాద్రి నుండి అస్త్రాద్రికి సూర్యుడు సంచరిస్తుంటే హనుమంతుడు కూడా దేహాన్ని పెంచి సూర్యునితో పాటు పరుగెత్తుతూ సూర్యుని వద్ద శ్రవణం చేసాడు. వ్యాకరణ శాస్త్రాన్ని క్షుణ్ణంగా సూత్ర, వృత్తి, వార్తిక, మహాభాష్య సంగ్రహపర్యంతం అభ్యసించాడు. ఛందశ్శాస్త్రంలోను, ఇతర శాస్త్రాలలోను సాటిలేని పాండిత్యాన్ని సంపాదించాడు. సర్వ విద్యాప్రవీణతలో, తపస్సులో దేవ గురువు బృహస్పతికి సమానమైనాడు. నవవ్యాకరణ సిద్ధాంతాలను హస్తగతం చేసుకొన్న హనుమంతుడు బ్రహ్మ దేవునితో సమానమైనాడు. సూర్యుడు హనుమంతుని గురుదక్షిణనీయమన్నాడు.

అంత హనుమంతుడు "స్వామి మీకేమి గురుదక్షిణ కావలయునో కోరుకొనుడని సూర్యుని ప్రార్థించాడు. అంత సూర్యభగవానుడు నా కుమార్తె సువర్చలను వివాహమాడుము. నాకదియే గురుదక్షిణ. నీవామెకు భర్త వయ్యెదవని ఆమె జన్మించినపుడే బ్రహ్మ చెప్పెను అని దినకరుడు చెప్పాడు.

# సువర్చల జన్మ రహస్యము

దేవ శిల్పియగు విశ్వకర్మ తన కుమార్తెయగు ఛాయాదేవిని దినకరున కిచ్చి వివాహము చేసాడు. ఆమె సూర్యుని వేడిని సహింపలేక పుట్టింటికేగి తల్లిదండ్రులతో చెప్పింది. పుత్రిక బాధ మాన్పుటకు విశ్వకర్మ సూర్యుని వేడితగ్గుటకు సూర్యబింబమును సానబెట్టాడు. సూర్య బింబము నుండి భిన్నమై రాలిన రజోరాశి నుండి సుందరమైన బాలిక ఉద్భవించింది. బాలిక యొక్క ముఖ వర్చస్సును చూచి బ్రహ్మాది దేవతలు ఆ బాలికకు సువర్చల అని నామకరణ చేసి ఆశీర్వదించారు. ఇంద్రాది దేవతలు బ్రహ్మదేవుని ఆమెకు భర్తకాగలవారెవ్వరని ప్రశ్నింపగా కొంత కాలమునకు కేసరీనందనుడు కపివీరుడు సూర్యుని కడకు విద్యాభ్యాసమునకై వస్తాడు. ఆ కపివరుడే ఈమెకు భర్తకాగలడని చెప్పాడు.

## మారుతి వివాహము - నాతిగల బ్రహ్మచర్య మర్మము

సూర్యుడు తన కుమార్తెను వివాహమాడమని కోరగా హనుమంతుడు స్వామి నేను బ్రహ్మచారిగా నుండవలెననుకొంటిని. నన్ను వివాహమాడుమను చున్నారేమి! నేనిపుడు ఏమి చేయవలెనని మారుతి సూర్యుని వేడుకొనెను. నీకు వ్రతభంగము కలుగకుండా వరమిచ్చెదనని సూర్యుడు హనుమంతునకు వరమిచ్చెను. అట్లయిన మీ కుమార్తెను వివాహమాడుదును కాని సంపర్కము ఉండదని ఆంజనేయుడు చెప్పగా దినకరుడా సమాచారమును తన కుమార్తెకు చెప్పగా సంపర్కము లేకపోయినను శ్రీ హనుమాన్ తనకు భర్తయగుటయే చాలునని ఆమె అంగీకరించినది.

అంత జ్యేష్ఠ శుద్ధ దశమినాడు శుభ ముహూర్తమున సూర్యభగవానుడు తన కుమార్తెయగు సువర్చలను అంజనా తనయునకు ఇచ్చి వివాహము చేసెను. అప్పుడు అంజనానందనుడు రాబోవు కల్పములో నేను బ్రహ్మనగుదును. నాకపుడు సువర్చలతో సంపర్కము కలుగునని చెప్పాడు.

| | | |
|---|---|---|
| ప్రవర్ | హనుమంతుడు | సువర్చల |
| గోత్రం | కౌండిన్య | కాశ్యప |
| తండ్రి | వాయుదేవుడు | సూర్యుడు |
| తాత | మరీచుడు | కశ్యపుడు |
| ముత్తాత | అంగీరసుడు | బ్రహ్మ |

## శ్రీ హనుమద్రాముల తొలి సమావేశ దివ్యలీల

మహాతేజశ్శాలి హనుమంతుడు రామయణ కథలో ప్రధాన భూమిక వహించాడు.

"రామాయణ మహామాలా రత్నం వందేఽనిలాత్మజమ్" రామాయణం అనే మాలికలో హనుమంతుని ప్రధాన రత్నంగా వర్ణించారు. వాల్మీకి రామాయణం కిష్కింధాకాండలో ద్వితీయ సర్గలో మనకు ఆంజనేయుని ప్రథమ దర్శనం జరుగుతుంది. సీతారాముల పట్టాభిషేకము వరకు తన మహనీయ స్ఫూర్తితో మనల్ని రామ భావనతో ప్రేరేపిస్తుంటాడు.

దశరథుడు శ్రీరామునకు పట్టాభిషేకం చేయుటకు నిశ్చయించాడు. అప్పుడు కైకేయి గతంలో తాను కోరిన వరాలను యీయవలసిందని మొదట వరంగా రాముడు పదునాలుగేండ్లు అరణ్యవాసం చెయ్యాలని, రెండవ వరంగా భరతునికి పట్టాభిషేకము చెయ్యాలని కోరిన ఫలితంగా సీతారామ లక్ష్మణులు అరణ్యాలకు వచ్చారు. ఆ మహారణ్యంలో రామలక్ష్మణులు లేని సమయంలో లంకాధీశ్వరుడైన రావణుడు సీతామాతను అపహరించుకుపోయాడు. రామ లక్ష్మణులు సీతాన్వేషణలో తిరుగుతూ పంపా సరోవరం వద్దకు వచ్చారు.

పంపా సరోవరం ప్రాంతములోని ఋష్యమూక పర్వతముపైనున్న వానర రాజు సుగ్రీవుడు, వానరులు పంపానది వద్ద సంచరిస్తున్న నరాకారము కలిగి, విల్లు బాణములు ధరించిన తేజోవంతులైన రామలక్ష్మణులను చూచి, వాలి ప్రేరణతో తమను వధించడానికి వచ్చిన వారుగా భావించి భీతి చెందారు. గుండెలు దడదడ కొట్టుకొనగా యే ప్రక్కకు పరుగెత్తుదామాయని చూచుచు నిప్పులు త్రొక్కిన కోతులవలె నొకచోట నిలువక భయపీడితులై శోకతప్తులై పరుగెత్తుచున్నారు. ఆ సమయంలో వారిలో నిర్భయుడైయున్న ఒకే ఒక వ్యక్తి హనుమంతుడు. వాలి కారణంగా భయపడుతున్న సుగ్రీవునొద్దకు ఆ ధైర్యవంతుడు హనుమంతుడు పోయి ఇలా పలికాడు.

"వానరరాజా! ఈ భయము నీకేల కలిగెను. ఇచ్చటకు వాలి మతంగ మహాముని శాపం వల్ల రాలేడు గదా? వాని జాడకూడా ఈ పరిసరములలో కనపడుటలేదు గదా. ధైర్యము లోపించుటచే నీ బుద్ధి స్థిరత్వాన్ని కోల్పోయింది. భయాన్ని విడిచి పెట్టండి" అని సుగ్రీవుని భయాన్ని పారద్రోలడమే గాకుండా ధైర్యాన్ని నూరిపోసినది. సుగ్రీవుని మంత్రులలో మతిమంతుడు హనుమంతు డొక్కడు మాత్రమే.

అప్పుడు సుగ్రీవుడు; హనుమంతా! నిజమే. మా అన్న వాలి ఈ పర్వతము పైకి రాలేడు. నేను దీనిని విడిచి వెళ్ళను, కావున ఇచ్చటకు రాగలిగి నన్ను చంపగలవారి నెవ్వరినో వాలి పంపెనని పంపానది యావల సంచరిస్తున్న తేజోమూర్తులను జూచి భయపడితిని. హనుమా! నీవు వారి వద్దకు తగిన వేషములో బోయి నీ మాటల నేర్పుతో వారి మనసును గ్రహించి వారు నిర్మలమగు మనస్సు గలవారు, వంచన లేనివారని నీకు దోచినవారిని గౌరవముతో తోడ్కొని రమ్మని చెప్పెను.

అంతమంది అనుచరులలో గూఢచారిగా విషయాన్ని సేకరించుటకు ఆంజనేయుని మాత్రమే సుగ్రీవుడు నియమించాడు. రాయబారికి ఉండవలసిన లక్షణాలన్నీ హనుమంతునికి ఉన్నాయన్న విశ్వాసమే అలా అంజనేయ స్వామిని ఎన్నుకోవడానికి ముఖ్యకారణంగా తెలుస్తుంది. గొప్ప సలహాదారుడుగా మాత్రమే గాక ఆదర్శమైన విశ్వసింపదగిన ఉద్యోగిగా, మంత్రిగా గూడా సమర్థుడు హనుమంతుడు.

ఆ మహావేగు సర్వశక్తి సంపన్నుడు, సకలశాస్త్రకోవిదుడు. ప్రభు భక్తి పారాయణుడు దౌత్యం చూపడంలో మిక్కిలి నేర్పరి, కోరిన రూపం ధరించగల సమర్థుడుయగు హనుమంతుడు రామలక్ష్మణుల వద్దకు ఏ రూపంలో బోయిన సత్యము తెలియునని ఆలోచించి వానర రూపంలో బోయిన సుగ్రీవుని బంటునని వారు గ్రహించిన పని వ్యర్థమగునని సామాన్యమగు మానవ రూపంలో బోయిన వీడెవడో పామరుడని మనస్సీయరని ఎట్లు బోదునాయని దీర్ఘముగా ఆలోచించి సన్యాసి వేషంలో వారి వద్దకు వెళ్ళెను.

శివాంశ సంభూతుడగు శ్రీ హనుమాన్ సాక్షాత్తూ విష్ణుంశమగు శ్రీరామ ప్రభువును దర్శించిన శుభసమయం శివకేశవుల అద్భుత కలయిక మరుపురాని దివ్యానుభూతి హరిహరుల అపూర్వ కలయిక లోకాలకు శుభారంభం, రాక్షసులకు విషయ ఘడియ.

అత్యద్భుతములైన యాకారములు గలిగి అసమాన తేజోవంతులైన రామలక్ష్మణులను చూచిన తోడనే అంజనేయుడు యధికానంద భరితుడైనాడు. వారిలో నీలమేఘుచ్ఛాయతో ప్రకాశిస్తున్న మహనీయుణ్ణి చూడడంతోనే భక్తాగ్రేసరుడు హనుమంతుడు హర్షపులకిత గాత్రుడయ్యాడు. అనేక జన్మల నుండి అన్వేషిస్తున్న కమనీయమూర్తి తనకు తానై దర్శనమిచ్చినట్లయింది. ఆ సుందరరూపుణ్ణి చూడటంలోనే హనుమంతుని ఆనందం ద్విగుణీకృతమయింది. అనిర్వచనీయమైన, అతీంద్రీయమైన అనుభూతి ఆయనను కొత్త లోకాలలో విహరింపజేసింది. హనుమంతుడా తన్మయ స్థితిలో తాను ధరించిన సన్యాసి వేషము గూడా మరచి భక్తితో వారికి నమస్కరించాడు.

ఇచ్చట ధర్మసూక్ష్మంగా పరిశీలించిన సన్యాసి తాను ముందు గృహస్తునకు నమస్కరించకూడదు. దైవాంశ సంభూతుడగు హనుమంతుడు రామునిలో భగవత్ సాక్షాత్కారం పొందుటవల్ల నమస్కరించాడు. యతియైనను దేవతను జూచినపుడు నమస్కరింపవలయును విధిననుసరించి పండితుడైన హనుమంతుడు శ్రీరామునకు నమస్కరించాడు.

ఆ మహాతేజస్వి హనుమంతుడు రామలక్ష్మణులతో మృదువచనాలతో మనోహరంగా -

అయ్యాలారా! మీరెవరు? ఈ అడవి ప్రదేశమునకేల వచ్చితిరి. ఏలన మీరు వ్రతనియమాలు పాటించు మహర్షుల్లాగా ఉన్నారు. గొప్ప దేహకాంతితో మెరిసిపోతున్నారు. మీరెవరు? మీరు గొప్ప వీరుల్లాగా కనిపిస్తున్నారు. గొప్ప పరాక్రమముగల వారిలా కన్పట్టే మీ చూపులు సింహపు చూపుల్లా ఉన్నాయి. మీ భుజాలు ఏనుగు తొండాల్లా ఉన్నాయి. మీ ధనస్సులు ఇంద్రధనస్సుల్లా శోభిస్తున్నాయి. మీరెవరు? ప్రాజ్ఞులారా! మీ చిహ్నములు చూడ బంగారు సింహాసనమున నుండ తగినవారుగానున్నారు. ఇట్టి వీరులగు మీరేల నార చీరలు కట్టి జటాధారులవలె జడలు ధరించి తిరుగుచున్నారు? మీ యోగ్యతకు మీ యిప్పటి స్థితి విరుద్ధముగానున్నది. ఏమి కారణము? ఆకాశమును విడిచి యీ లోకమునకు జూచి బోవ గ్రీడార్థమరుదెంచిన సూర్యచంద్రులవలెనున్నారు. నిజముగ "మీరెవరు? మీ అమ్ముల పొదులు పగవారి ప్రాణములు దీయ బుసకొట్టు పాములవంటి బాణములచే నిండియున్నవి. చూచుటకు శుభకరములై యున్నవి. మిక్కిలి నిడివి వెడల్పుగలిగి, చూచుటకు భయంకరములై యపరంజి (బంగారు)చే వృద్ధి చెందిన మీ కత్తులు కుబుసము విడిచిన పాములవలె ఉన్నవి. మీరు వింధ్యశైలములతోను ప్రకాశించు నీ భూమినంతయు పరిపాలింపదగిన వారలయు నిట్టి దీన స్థితి యందేలయున్నారు.

హనుమంతుడు ఎన్ని ప్రశ్నలు వేసినను రామలక్ష్మణులాయన మాటల సొంపు, పెంపు వినుచు నూరకుండిరి గాని యొక్క దానికైనను ప్రత్యుత్తరమిచ్చిన వారు కాదు. ఇచ్చట ధర్మసూక్ష్మం ఉన్నది. మనము కొత్తవారితో పరిచయము లభింపవలయునన్న ముందు మనను గూర్చిన వివరములు వారికి చెప్పి వారిని గూర్చిన వివరములు అడగాలి. ఇచ్చట పరమ భక్తాగ్రేసరుడు హనుమంతునకు

సాక్షాత్తు విష్ణుస్వరూపంగా రామదర్శనం అగుటవల్ల భక్తిపారవశ్యంతో ధర్మము మరిచి తానెవరో చెప్పకుండా రామలక్ష్మణులను వారి వివరములు అడిగారు.

ఆ హనుమంతుడు యుక్తిపరుడు గాన వెంటనే ధర్మము గ్రహించి ఆర్యులారా! నేనింత దూరము మాటలాడినను మీరొక మాటయైనను బదులిడి నారుగారు. ఇక నావృత్తాంతము చెప్పెదను. వినుడు. సుగ్రీవుడనే వానరశ్రేష్ఠుడు ఈ పర్వతముపై నున్నాడు. ఆయన గొప్ప వీరుడు. ధర్మాత్ముడు అతని అన్న వాలిచే వెడలగొట్టబడి నిలువనీడలేక ప్రాణభయముతో దిరుగుచున్నాడు. నా పేరు హనుమంతుడు. నేను సుగ్రీవుని మంత్రిని. మీ స్నేహము గోరి సుగ్రీవుడు పంపగా దూతగా వచ్చాను. ఇలా సన్యాసిరూపంలో వచ్చాను. కోరిన రూపం ధరించగలను. మా రాజైన సుగ్రీవుడు మీ సఖ్యాన్ని వాంఛిస్తున్నాడు అని పలికాడు.

ఆ మహా తేజస్వి హనుమంతుని మాటలు శ్రీరామునకు ఎంతో సంతోషాన్ని కల్గించాయి. ఆనందముతో రాముని ముఖం వికసించింది. ఆ కోదండ రాముడు లక్ష్మణునితో ఇలా పలికాడు. లక్ష్మణా! సుగ్రీవుని మంత్రి పలికే మాటలు విన్నావా? మాటల తీరు ఎంతో చక్కగా వుంది. మాటల మర్మము తెలిసిన మహనీయుడు యితడు. ప్రతి పదము వ్యాకరణ శుద్ధము క్రమము ననుసరించియున్నది. కంఠధ్వని అతిమధురంగా ఉంది.

ఉచ్ఛారణ సంస్కారవంతముగా నున్నది. చంపేందుకు సన్నద్ధుడైన శత్రువు యొక్క హృదయము కూడా అప్పటికప్పుడు మార్చగలిగేటట్లు యితని మాటలలో పోకడ వుంది. ఇలాంటి దూతలు ప్రభువుకు ఏకార్యాన్నైనా సాధిస్తారు.

"మనం సుగ్రీవుణ్ణి అన్వేషిస్తూ వచ్చాము. అట్టి సుగ్రీవుని మంత్రి ఇతడు మన వద్దకే వచ్చాడు. నాకు చాలా ఆశ్చర్యంగాను, సంతోషంగాను ఉంది" అని పలికాడు రాముడు.

ఆ తేజోవంతుడు రాముడి నుంచి తొలిసారి పరిచయంలోనే ఇంతటి మహత్తరమైన మన్ననలను పొందిన మహనీయమూర్తి హనుమంతుడు ఒక్కడు మాత్రమే. పరస్పర సంశయాలు తీరాయి. అన్యోన్య విశ్వాసం కుదిరింది. హనుమంతుడు రామ, లక్ష్మణులను తన భుజాలపై కూర్చోపెట్టుకొని సుగ్రీవుని వద్దకు చేరాడు.

## హనుమకు వాలి, సుగ్రీవులు మేనమామలు

గౌతమునకు అహల్యయందు శతానందుడను కుమారుడు, అంజన అనే కుమార్తె జన్మించినారు. అంజన కుమారుడే హనుమ. అహల్యకు సూర్య, ఇంద్రుల అనుగ్రహముతో వాలి, సుగ్రీవులు జన్మించినారు. అంజన హనుమంతునితో నాయనా! నీ మేనమామలు వాలి, సుగ్రీవులు బద్ధవిరోధంగా ఉన్నారు. ధర్మపక్షం వహించిన సుగ్రీవుని ఆశ్రయించి రక్షకుడవై యుండుము. వాలితో మాత్రము ఎట్టి పరిస్థితిలోను యుద్ధానికి తలపడవద్దు అని చెప్పింది.

తల్లి ఆదేశంతో స్వకార్యం ఉన్నది. స్వామి కార్యం ఉన్నది. అంతేకాదు. అది గురుకార్యం కూడా. హనుమ గురువు సూర్యభగవానుడు కాగా ఆ సూర్యుని కుమారుడే సుగ్రీవుడు కాబట్టి సుగ్రీవుని సేవించటం, రక్షించటం గురుకార్యం కూడా అవుతుంది. తల్లి ఆజ్ఞప్రకారము మారుతి సుగ్రీవుని మంత్రిగా వ్యవహరిస్తూ ఉన్నాడు.

## రామ సుగ్రీవుల మైత్రి

ఆ వానరశ్రేష్ఠుడు హనుమంతుడు సుగ్రీవుని వద్దకు రామలక్ష్మణులను తీసుకువెళ్ళి పరస్పర పరిచయం గావించాడు.

అప్పుడు ఆ వానర రాజు సుగ్రీవుడు వినయ విధేయతలతో - రామా! నేను వానరుణ్ణి. నీవు నా స్నేహాన్ని వాంఛించటము నాకు గొప్ప సత్కార్యము, లాభదాయకము, శ్రేయోదాయకము అని చెప్పాడు.

ఆకులతో, పూవులతో నిండియున్న మద్ది కొమ్మను నేలమీద పరిచాడు. శ్రీరాముని ఆహ్వానించి రామునితో కలిసి కూర్చున్నాడు.

అది చూచి మహాజ్ఞాని హనుమంతుడు పూవులతో నిండియున్న చందనపు కొమ్మను విరిచి లక్ష్మణునకు ఆసనం ఏర్పాటు చేశాడు.

ఒడంబడిక ప్రకారము వారిని హతమార్చుటకు రాముడు వాలితో యుద్ధానికి సుగ్రీవుని పురిగొల్పాడు. వాలి, సుగ్రీవులు భీకరంగా పోరాడుతున్నారు. వాలి చేతిలో సుగ్రీవుడు ఓడిపోయాడు. వాలి కొట్టే దెబ్బలకు సుగ్రీవుని దేహమంతా శిథిలమైంది.

సుగ్రీవుడు యుద్ధము నుండి పారిపోయి రాముని వద్దకు వచ్చి ఇలా పలికాడు. "రామా! వాలిపై కాలు దువ్వమన్నావు. వాలిని వధిస్తానన్నావు. తీరా యుద్ధానికి వెళ్ళాక వాలితో తన్నించావు ఇలా ఎందుకు చేశావు" అని అడిగాడు.

అప్పుడు రాముడు "మిత్రమా! బాధపడకు మీరు యిద్దరూ ఒకే పోలికగానున్నారు. మీ యిద్దరిలో వాలిని గుర్తించలేక బాణం వెయ్యలేదన్నాడు. నిన్ను సులభంగా గుర్తించటానికి గజపుష్పమాల ధరించి నీవు మరల వాలితో పోరాడు. ఒకే ఒక బాణంతో వాలిని నేల కూలుస్తాను" అని రాముడు అభయమిచ్చాడు.

## వాలి వధ

సుగ్రీవుడు గజపుష్పమాల ధరించి వాలిని యుద్ధానికి రమ్మని మరలా సుగ్రీవుడు కవ్వించాడు. వాలి భార్య మహాజ్ఞాని తార. "నాథా! సుగ్రీవుడు నీతో దెబ్బలుతిని పారిపోయి మరల వెంటనే యుద్ధానికి సిద్ధమయ్యాడంటే ఎవ్వరో సుగ్రీవునకు సహాయము వచ్చి వుంటారు. ఇప్పుడు యుద్ధానికి వెళ్ళ వద్దన్నది. ఆ మహాబలశాలి తార మాట లక్ష్యపెట్టకుండా సుగ్రీవునిపై మరల యుద్ధానికి తలపడ్డాడు. వాలి సుగ్రీవుల దేహాలు రక్తమయమయ్యాయి. సుగ్రీవుడు బాగా అలసిపోయాడు. ఓటమి సుగ్రీవుని చేరిందని గ్రహించాడు రాముడు.

ఆ మహాబలపరాక్రమవంతుడు రాముడు క్రూరమైన సర్పబాణం వాలిపై సంధించాడు. ఆ భయంకర బాణం దెబ్బకు వాలి నేలపై కూలిపోయాడు.

## వాల్మీకి రామాయణంలోని సుందరకాండలో
## శ్రీ ఆంజనేయస్వామివారి అద్భుత శక్తి

శ్రీరాముని సమక్షంలో సుగ్రీవుడు వానరుల్ని దేశాంతరాలను వర్ణించి సీతాన్వేషణకు పంపసాగాడు. వానరవీరులందరు నిష్క్రమించాక సుగ్రీవుడు హనుమంతుని దగ్గరకు పిలిచి ప్రేమపూర్వకముగా వీపు తడుతూ "హనుమా! జలస్థలాకాశాలలో నీ గతి నిరాటంకము. స్వర్గలోకంలో కూడా నీవు సునాయాసంగా సంచరించగలవు. గతి వేగ స్ఫూర్తులలో నీవు నీ తండ్రితో సమానుడవు. సీతమ్మ

వారి జాడను తెలుసుకొని రాగల సమర్థుడవు నీ ఒక్కడవే అని నాకు పూర్ణ విశ్వాసముంది" అన్నాడు.

సుగ్రీవుని వచనాలను విన్న శ్రీరామచంద్రుడు మారుతిని దగ్గరకు పిలిచి "హనుమా! నా కార్యాన్ని నీవు నెరవేర్చగలవు. నీ వల్లనే నా జానకి నాకు లభిస్తుందని పిస్తుంది. ఇదిగో నా అంగుళీయకమిస్తున్నాను. ఈ ఉంగరాన్ని జూపితే నిన్ను జానకి విశ్వసిస్తుంది" అని పలికి సీతతో చెప్పవలసిన సందేశ వాక్యాలు చెప్పాడు. అంత హనుమదాదులు నమస్కరించి బయలుదేరారు.

"కోట్లాదిమంది వానర వీరులలో సీతాన్వేషణకు ఒక్క వాయునందనుడు మాత్రమే సమర్థుడు. బుద్ధి వుంది, బలముంది, సాహసం వుంది. దేశకాలాలను గుర్తెరిగే ప్రజ్ఞ వుంది" అని సుగ్రీవుడు స్తుతించాడు. శ్రీరామునికి కూడా హనుమంతుని యందు సంపూర్ణ విశ్వాసముంది. కాబట్టే తన ఉంగరాన్ని అంత మందిలో హనుమంతునకు మాత్రమే ఇచ్చాడు.

సుగ్రీవుడిచ్చిన నెలరోజుల గడువుకాలం గడిచిపోతున్నా సీతమ్మ వారి జాడ తెలియకపోవటం వల్ల వానరులందరు శోకసముద్రంలో మునిగిపోయారు. అదే సమయంలో జటాయువు సోదరుడగు పంపాతి దర్శనం వారికి అయింది. జానకీ దేవిని రావణాసురుడు లంకలోనే యుంచినాడని పంపాతి సీతమ్మ వారి జాడ చెప్పింది. వానరభల్లుకాలన్నీ సంతోషముతో సాగరతీరంలో సమావేశ మయినాయి. సముద్రాన్ని లంఘించగల వారెవరన్న విషయంపై చర్చ ఆరంభ మైనది. వారిలో ఎవ్వరూ నూరు యోజనాలు దాటి రాగలమని ముందుకు రాలేదు. చివరకు అంగదుడొక్కడే సమర్థుడని నిర్ణయించారు. కాని అంగదుడు మరల తిరిగి రావటంలో సందేహం వుంది అన్నాడు.

ఇట్టి స్థితిలో జాంబవంతుడు లేచి హనుమంతుని సమీపించి "హనుమా! వేగంలో నీవు నీ తండ్రివంటి వాడవు. అటు భుజబలంలోను, ఇటు బుద్ధి బలంలోను నీకు సాటి వచ్చేవారెవ్వరు లేరు. నీ శక్తి ఎంతటిదో నువ్వు ఎరుగవు. నీ తండ్రివలె నీవు క్షణంలో సముద్ర లంఘనం చేయగలవు. లేచి విజృంభించు. ఈ మహత్కార్యం నీవల్లనే సాధింపబడాలి" అని పలికాడు.

# సముద్ర లంఘనం

జాంబవంతుని పలుకులు వినేసరికి హనుమంతుడు ఆత్మస్మృతిని పొందాడు. ఆత్మ విశ్వాసాన్ని ధరించాడు. విరాట్ రూపాన్ని ధరించి గర్జిస్తూ "భగవదనుగ్రహంవల్ల నేనీ సముద్రాన్ని అవలీలగా లంఘించి వేస్తాను. జానకీ దేవిని దర్శించి, లంకను పెకలించి మీ ముందుంచుతాను. భగవత్ కార్యాన్ని సాధించే నా మార్గానికి ఆటంకం కలుగజేయగల శక్తి ఏదీ లేదు. మీరు నిశ్చింతగా వుండండి" అన్న గర్జనలతో కూడిన హనుమంతుని గంభీర వచనాలు విన్న వానర సైన్యం ఉల్లాసంతో హర్షనాదాలు చేసింది.

ఆ మహాకాయుడు హనుమంతుడు అమిత వేగంతో ఎగిరి మహోన్నత మైన మహేంద్రగిరి శిఖరాన్ని అధిరోహించాడు. ఆయన చరణఘాతాలకు పర్వత శృంగాలు విరిగి పడిపోసాగాయి. అతని వాల సంచలన వేగానికి మహావృక్షాలు ఆకాశంలో ఎగురసాగాయి. రామకార్యం కొరకు దక్షిణ దిక్కుగా ఎగిరిపోవటానికి కృతనిశ్చయుడయ్యాడు. తన ప్రయత్నం విజయవంతం కావాలని తూర్పు దిక్కుకు తిరిగి సూర్యునికి, ఇంద్రాది దేవతలకు, బ్రహ్మదేవునకు, పంచ మహాభూతాలకు, తండ్రియైన వాయుదేవునకు భక్తితో నమస్కరించాడు.

ఇచ్చట ధర్మసూక్ష్మం వున్నది. మారుతి దక్షిణ దిక్కు నుండి తూర్పునకు తిరిగి దైవాలకు నమస్కరించాడు. కావున మనము శుభకార్యములకు దైవములకు గాని, పెద్దలకుగాని దక్షిణ దిక్కుకు తిరిగి నమస్కరింపరాదు.

పౌర్ణమినాడు పొంగే మహా సముద్రమువలె హనుమంతుని దేహం అంతులేకుండా పెరిగింది. అట్లా అపరిమితంగా తన కాయాన్ని పెంచిన వాయు నందనుడు తన చేతులతోను, కాళ్ళతోను మహేంద్ర పర్వతాన్ని కదిలించినాడు. ఆ కుదుపుకు ఆ పర్వతం మీదవున్న మహా సర్పాలు పెద్ద పెద్ద పడగలు విప్పి నిప్పులు కక్కుతూ కోరలతో అచ్చట రాళ్ళను కాటువేసినవి. ఆ భయంకర విషనాగుల కాట్లకు రాళ్ళన్ని భగభగమండుతూ ముక్కలు ముక్కలుగా పగిలినవి. ఆ పర్వతగుహలోనున్న జంతువులు భయంకరంగా అరచినవి.

మహేంద్ర పర్వతము నుండి ఆ పర్వతాకారుడు మారుతి ఆకాశంలోకి ఎగిరాడు. అన్యదృష్టిలేకుండా మారుతాత్మజుడు అంబర మార్గంలో పురోగమిస్తున్నాడు.

## ఆ వీర్యవంతుడు హనుమంతుని మైనాక పర్వతము తనపై విశ్రమించకోరుట

ఆ సమయంలో సముద్రుడు తన గర్భంలో దాగియున్న మైనాక పర్వతాన్ని పిలిచి "మైనాకా శ్రీరామచంద్రుని పూర్వీకులే నాకీ రూపాన్ని ప్రసాదించారు. నీవు పైకిలేచి రామ కార్యానికై వెళుతున్న హనుమంతునకు నీ శిఖరం మీద నిలిచి విశ్రాంతి తీసుకొనటానికి వీలు కల్పించమన్నాడు". మైనాకుడు వెంటనే పైకిలేచి హనుమంతుని తన శిఖరంపై నిలిచి విశ్రాంతి పొంది ఆహార పానీయాలను ఆతిధ్యాన్ని స్వీకరించమని ప్రార్థించాడు. అప్పుడు మహా సత్వసంపన్నుడు హనుమంతుడు "అయ్యా! నాకు పెద్ద కర్తవ్యముంది. మధ్యలో ఆగే వీలులేదని" సాగిపోయాడు.

## నాగమాత సురస హనుమంతుని పరీక్షించుట

తదనంతరము దేవ, గంధర్వ, సిద్ధులు హనుమంతుని శక్తియుక్తులను పరీక్షించవలసినదిగా నాగమాత సురసను పంపారు. వెంటనే సురస రాక్షస రూపంలో హనుమంతుని ముందు నిలిచి "అయ్యా! నీవు నా నోటిలో ప్రవేశించాలి. ఇది నాకు దేవతలు ఇచ్చిన వరం" అని సురస పెద్దగా నోరు తెరచింది. మహా తేజశ్శాలి హనుమంతుడు అంతకంటె మించి తన శరీరాన్ని పెంచాడు. సురస తన నోటిని మరింత విస్తృతం చేసింది. మహాబలవంతుడు మారుతి అంతకంటె అధికంగా శరీరాన్ని పెంచాడు. పోటాపోటీగా ఈ విధంగా కొంతసేపు గడిచింది. ఉన్నట్లుండి యుక్తిశాలి కేసరీనందనుడు తన శరీరాన్ని అంగుష్ఠ మాత్రప్రమాణం చేసి సురస నోటిలోకి ప్రవేశించి, వెంటనే బయటకు వచ్చాడు. అప్పుడు హనుమ చేతులు జోడించి "అమ్మా! నీ యిష్ట ప్రకారము నీ నోటిలో ప్రవేశించాను. నీ కోర్కె నెరవేరింది. నేను నా పనికోసం పోయేందుకు అనుమతి ప్రసాదించు" అని కోరాడు. వాయునందనుని చాతుర్యము, సమయస్ఫూర్తి, వినయము చూచి సురస సంతోషించి 'నీకు జయమగుగాక' అంటూ ఆశీర్వదించింది.

## సింహిక వధ

వీర్యవంతుడు హనుమంతుడు మరింత వేగంతో విజృంభిస్తున్నాడు. ఆ ప్రాంతములో సముద్రములో సింహిక అనే రాహువు తల్లి రాక్షసి వుంది.

అది ఛాయాగ్రాహి. జంతువుల నీడపట్టి లాగి తింటూ వచ్చింది. అది హనుమంతుని చూడటంతోనే ఆయన నీడను బట్టి లాగసాగింది. హనుమంతుడు హఠాత్తుగా సూక్ష్మరూపం ధరించి దాని వికృతాకార ముఖంలో ప్రవేశించి ప్రేవులతోసహా బయటపడవేశాడు. సింహిక కూలిపోయింది. గంధర్వులు, యక్షులు, రాక్షస పీడ తొలగినందుకు సంతోషించి హనుమంతుని కొనియాడారు.

మహాతేజోవంతుడు హనుమంతుడు. బలము, నిగ్రహము, చాతుర్యము, శౌర్యము, కర్తవ్యము మొదలగు గుణాలను ప్రకటిస్తూ నూరు యోజనాలు దూరంగల లవణ సముద్రాన్ని అవలీలగా దాటేశాడు.

## లంకాధి దేవత లంకిణి పరాభవము

ఆ మహామేధావి హనుమంతుడు పెంచిన స్థూలకాయంతో లంకలో ప్రవేశిస్తే రామకార్యం చెడుతుందని సూక్ష్మరూపంలో లంకలో రహస్యముగా ప్రవేశిస్తున్న మహాబలవంతుడు హనుమంతుని లంకాధి దేవత లంకిణి చూచింది. నన్ను జయించక లంకాపురిలో అడుగుపెట్టడం నీతరం కాదంది. బెదిరించింది. హనుమంతుడు లంకా పట్టణం చూడాలనియున్నది. చూచి వచ్చి నా దారిన పోతాను అన్నాడు. భయంకరమైన రాక్షసి అరుస్తూ అరచేతితో బలంగా హనుమంతుని కొట్టింది. దానితో అతడు క్రోధావేశంతో ఆమెను బలంకొద్ది ఒక గుద్దు గుద్దాడు. అవయవాలు పట్టు తప్పి క్రిందపడింది లంకిణి. తనను చంపవద్దని ప్రాధేయపడింది. లంకాధి దేవత ఒక్క వానరుడు నన్ను పరాక్రమంలో జయిస్తే రాక్షసులకు కీడు సంభవిస్తుందని మున్ను బ్రహ్మ నాతో చెప్పాడు. ఆ సమయం ఇప్పుడాసన్నమైంది. లంకా పట్టణంలోకి స్వేచ్ఛగా వెళ్ళి నీవేం చేయదలచావో చేయ్ అని లంకిణి హనుమంతునితో చెప్పింది.

## ఆ కపిశ్రేష్ఠుడు లంకలో ప్రవేశించుట

ఆ రాక్షసి మాటలు హనుమంతునకు ఆనందం కలిగించాయి. అత్యుత్సాహంతో శత్రు స్థానానికి ముఖద్వారం గుండా ప్రవేశింపగూడదని కోట ప్రాకారం దూకి లోపలికి వెళ్ళాడు. శత్రుగృహం ప్రవేశించేటప్పుడు ఎడమకాలు ముందు వెయ్యాలని సాంప్రదాయం పాటించి ఎడమ పాదంతో ముందు అడుగువేసి మనోహరమైన లంకలో ప్రవేశించాడు బుద్ధిమంతుడు హనుమంతుడు.

మహావేగు హనుమంతుడు మనోహరమైన లంక ప్రవేశించి సీతమ్మవారి జాడ అన్వేషిస్తూ ఆ రాత్రి విచిత్రములైన రంగుల పూలదండలతో అలంకరించిన రాక్షసుల భవనాలన్నిటిని శోధించాడు. రావణుని రాజమహలును, అందులోని ఉపగ్రహాలను, రాక్షస నాయకుల సౌధాలను చూచాడు. ఎటుచూచిన స్వర్ణ మయంగా, శోభాయమానంగా ఉన్న ఆ సౌధాలను తిలకించి హనుమంతు డాశ్చర్యభరితుడయ్యాడు. ప్రపంచంలోని వజ్రవైడూర్యాలు, బంగారము అక్కడే నిక్షిప్తమయినవి అన్నట్లున్న ఆ పట్టణం కన్నులు మిరుమిట్లు గొలుపుతూ అత్యంత అద్భుతముగా యున్నది. మహామహిమాన్వితమైన ఎన్నో అంతస్తులు కలిగి ఎంత మందికైనను చోటు కల్పించగల అద్భుతమైన పుష్పక విమానాన్ని మారుతి చూచినాడు. అతి మనోహరమై వసంత ఋతువుకన్న రమణీయంగా వున్న ఆ విమాన శోభ కచ్చెరువు పొందుతూ ముందుకు సాగి రావణుని శయన మందిరం ప్రవేశించాడు హనుమంతుడు.

రావణుని రతి గృహములో చిత్రకంబళి మీద రంగురంగుల చీరెలతో రంగు రంగుల పూలదండలతో, నానావిధాలంకారాలతో, నానావిధ వేషాలతో ఉత్తమాంగనలు పడుకొని నిద్రపోతున్నారు. వారందరు మద్యపానము చేసినారు. క్రీడించినారు. సొమ్మసిల్లి నిద్రపోతున్నారు. వారు మద్యపానము చేసి మదన క్రీడలో ఉన్నప్పుడు వారు పెట్టుకొన్న పూలదండలు, ఆభరణాలూ స్థానాలు తప్పిపోయినవి. వారు అర్ధనగ్న శరీరములతో మైమరచి నిద్రపోతున్నారు. కొందరు పెట్టుకొన్న ముత్యాల హారాలు, చంద్రకిరణాలవలె తేజరిల్లుతూ వారి స్థానాల మధ్య హంసలు పడుకొన్నట్లుగా కనిపించినవి. కొందరు పెట్టుకొన్న వైడూర్య హారాలు వారి స్థానాల మధ్య కౌదంబ పక్షులవలె కనిపించినవి. కొందరు పెట్టుకున్న హేమ సూత్రాలు వారి స్థానాల మధ్య చక్రవాక పక్షులవలె కనిపించినవి. వారు విడుస్తున్న ఊపిరులకు వారి పైమిటి చెరగులు మాటిమాటికి వారి ముఖాల మీద కొట్టుకొంటూ మనోహరమైన కాంతులతో గాలికి ఎగిరే జండాలవలె కనిపించినవి.

ఆ స్త్రీల అందరి మధ్యన పడుకొనియున్న ఆ కాంతివంతుడు రావణాసురుడు నక్షత్రాల మధ్య చంద్రుడువలె తేజరిల్లుతున్నాడు. ఆ బుద్ధిమంతుడు హనుమంతుడు ఆ అంతఃపురములో ఏ ఒక్క ప్రదేశము వదలి పెట్టకుండా అంతా చూచినాడు. కాని సీతామాత మాత్రం కనిపించలేదు.

ఆ రతి క్రీడా మందిరములో మదన వ్యాయామములో అలసిపోయి ముకుళించు కొన్న పద్మాలవలె నిద్రాపరవశులు అయిన అవరాంగనలను చూచి ధృఢ మనస్కుడు హనుమంతుడు అట్లా అంతమంది పరస్త్రీలను చూడటం వల్ల ధర్మోల్లంఘనం చెయ్యలేదు కదా అనే సందేహంలో పడ్డాడు. నేడు నా వల్ల మహాపరాధం జరిగింది అనుకుంటూ విచారంలో మునిగిపోయాడు. ఉత్తర క్షణంలో అతని మనస్సులో మరో భావం ఉదయించింది. ఆ సమయంలో భగవత్ స్మరణవల్ల అతని హృదయం పరిశుద్ధమయింది. సీతామాతను చూడవలెను అనే ఒక నిశ్చయంతో అట్లా తిరిగి చూచినాడు. పరపురుషులు ఎవ్వరు రాలేరు అనే నమ్మకంతో ఆ సుందరాంగనలు విచ్చలవిడిగా నిద్రపోతున్నారు. శుభా శుభ స్థితులలో ఇంద్రియాల ప్రవర్తనకు మనస్సే కారణం. మనస్సును బట్టే దేహేంద్రియాలు ప్రవర్తిస్తూవుంటాయి. వారిని అట్లా చూచినప్పుడు ఏ కొంచెం మనోవికారము కలుగలేదు. నా మనస్సు వ్యవస్థ తప్పలేదు. స్త్రీలు లేనిచోట నేను సీతాదేవిని వెతికినా ప్రయోజనం వుండదు. అందువల్ల స్త్రీలు వుండేచోటు నేను జాగ్రత్తగా వెతికాను. నాలో దోషంలేదు అనుకొన్నాడు అచంచల మనస్కుడు ఆ హనుమంతుడు. ఎంత వెతికినా సీతమ్మ వారి జాడ కనపడక పోవటంతో హనుమంతుని మనస్సు బాధపడింది. తన ప్రభువు శ్రీరామ చంద్రునకు, సీతామాతకు నమస్కరించాడు. అప్పుడు అల్లంత దూరంలో అతనికి అశోకవనం కనిపించింది. సంతోషముతో ముందుకు సాగినాడు.

## సీతా సందర్శనం

ఆ యుక్తిపరుడు హనుమంతుడు సూక్ష్మరూపంలో అశోకవనంలో ప్రవేశించాడు. చంద్రుని కాంతులతో తేజరిల్లుతూవున్న ఆ సుందరవనమంతా సీతామాత జాడ కొరకు కలియజూచాడు. ఆ సమయంలో హనుమకు చంద్రుని వెన్నెల మనోహరంగా తోడు అయింది. ఆ వనంలో పలు ప్రాంతాలు పరిశీలించి వనం మధ్యలోనున్న శింశుపా వృక్షం అధిరోహించాడు. ఆ కేసరినందునకు ఆ వెన్నెల కాంతిలో దగ్గరలోనున్న పెద్ద ప్రాసాదం ప్రక్కన చెట్టు క్రింద మలిన వస్త్రాలు ధరించి ఉపవాసాల మూలంగా కృశించిన శరీరంతో శుక్లపక్షం ప్రారంభం నాటి చంద్రరేఖవలెవున్న ఒక స్త్రీ కనిపించింది. శ్రీరామచంద్రుడు జానకిని వర్ణించి చెప్పటం జ్ఞాపకం వచ్చింది మారుతికి. ఆ స్త్రీమూర్తిని మరలా పరికించి చూశాడు.

ఆయనకు ఈ స్త్రీ మూర్తే నిస్సందేహంగా సీతామాతయని నిశ్చయం కలిగింది. ఆమె చుట్టూ రాక్షసి సమూహముంది. సీత యొక్క ఆ దురవస్థను చూచి హనుమంతుడు అతి వ్యాకులితుడైనాడు. అంతలో రావణాసురుడు దాసీ పరివారంతో సీత వద్దకు వస్తున్నట్లు కనపడింది. రావణుని రాక గమనించిన హనుమంతుడు చెట్టుపై ఆకులచాటున కనపడకుండా కూర్చుని జరిగేదంతా పరిశీలిస్తున్నాడు.

రావణుడు సీతామాతకు అనేక ప్రలోభములు చూపించాడు. భయపెట్టాడు. రెండు నెలల గడువు పెట్టి వెళ్ళిపోయాడు. రావణుడు వెళ్ళిన తరువాత రాక్షసీ జనం అటు ఇటు కొంతసేపు పోరాడి గాఢనిద్ర పోయారు.

## హనుమంతుని సందేశం

హనుమంతుడు అదను చూచుకొని సీతామాత కూర్చున్న చెట్టుపైకి ఎక్కి కొమ్మల గుబురులో కూర్చొని కోసల దేశభాషలో ఆది నుండి దశరథుని విషయం మొదలుకొని రామలక్ష్మణుల వృత్తాంతం యిప్పటి వరకు మధుర వాణితో వినిపించసాగాడు. సీతాపహరణం తరువాత సీతను వెదకుతూ రామ లక్ష్మణులు సుగ్రీవునితో సఖ్యత నెరపటం, సీత యొక్క నగలను చూడటం, వానర వీరులు సీతను వెదకుటకు నలువైపులా వెళ్ళటం సాంగో, పాంగంగా సారాంశ కథను వినిపించాడు. తన ఆగమన విషయమును తెలియజేశాడు.

ఈ మాటలు విన్న జానకి ఆశ్చర్యానందాలను పొందింది. సీతామాత పైకి చూచింది. హనుమంతుడు తెల్లని వస్త్రాలు ధరించి వున్నాడు. హనుమంతుడు చూశాడు. క్రిందకి దిగాడు. ఆమె పాదాలకు సాష్టాంగ నమస్కారం చేశాడు. ఆమె హనుమంతుని అనేకం ప్రశ్నించింది. వాటికన్నిటికి ఆయన తృప్తిగా సమాధానం చెప్పాడు. హనుమంతుని రామదూతగా నమ్మింది. ఆ సమయంలో వాయు నందనుడు రామ ముద్రికను ఆమెకు భక్తితో సమర్పించాడు. దాన్ని చూస్తూనే ఆమె పరమానందం చెందింది. ఆయనను ఘనంగా ప్రశంసించింది.

ఆ వానర శ్రేష్ఠుడు సీతా మాతను ఓదార్చి, రాముడు ఆమె వియోగం వల్ల వర్ణించనలవిగానంతగా దుఃఖిస్తూన్నాడని , అతి త్వరలో రాక్షసులందరినీ యుద్ధంలో సంహరించి విజయుడై ఆమెను తీసుకు వెళ్ళుతాడని చెప్పాడు.

మహా తేజోవంతుడు హనుమంతుడు సీతతో "అమ్మా, యిప్పుడే నిన్ను నా వీపుపై కూర్చోబెట్టుకొని సునాయాసంగా నేను సముద్రం దాటుతాను. తల్లీ సంశయించకు. రావణునితో కలిపి లంకనంతా మోసే శక్తి నాకుంది" అన్నాడు. హనుమంతునితో సీతమ్మ ఇలా పలికింది. "హనుమా! ఇంత చిన్న శరీరంతో నన్ను మోసుకొని రామునిదగ్గరకు పోవటమా! అదీ సముద్రము మీద ఆకాశంలో' అన్నది. అప్పుడు హనుమంతుడు తన బలమేమిటో తెలియక సీతమ్మ అలా భావిస్తూ, ఏదో ఏదో మాట్లాడేస్తుంది. తన శక్తిని ఆమెకు చూపటం మంచిదని భావించాడు.

## విశ్వరూపం

మహాతేజోవంతుడు హనుమంతుడు తన మహదాకారము చూపించటానికి ఆ చెట్టు అవతలకు ఎగిరి తన దేహాన్ని పెంచటం మొదలుపెట్టాడు. మేరు పర్వతమంత పెరిగాడు. మందర పర్వతమంత అయ్యాడు. అతని ముఖం బాగా ఎర్రబడి ఉంది. ప్రజ్వలించు అగ్ని ముద్దలా గోచరించాడు. వజ్రాయుధం లాంటి కోరలతోను, పెద్ద పులి గోళ్ళలాంటి గోళ్ళతోను అతిభయంకరమైన ఆకారముతో నిలిచి చేతులు జోడించి సీతాదేవితో "ఓ దేవి! చూడు నా స్వరూపాన్ని. పర్వతాలు, వనాలు, కోటబురుజులు, ప్రాకారాలు, మేడలు, రాజైన రావణాసురునితో సహా లంకా పట్టణాన్ని మోసుకొని పోగలను. ఇక సంశయించక నాతోపాటే వచ్చి శ్రీరాముని దర్శించు" అన్నాడు.

"ఓ కపిశ్రేష్టా! నీ బలమెలాంటిదో! నీ ధైర్యమేమిటో నాకు తెలిసింది. వాయుదేవుని వంటి వేగము, అగ్ని వంటి తేజస్సుగల నిన్ను ఎవ్వరూ అడ్డగించలేరు. "వానరవీరా! నీతోడనై నేను రావటం యెన్నో కారణాలను బట్టి యోగ్యం కాదు. రాముడే స్వయంగా వచ్చి రాక్షస సంహారం చేసి నన్ను విడిపించుకొని తీసుకువెళ్ళటమే యోగ్యము. ఇలా రహస్యంగా వెళ్ళిపోవటం నాకు గాని, రామునికిగాని గౌరవప్రదంకాదు గదా! అందుచేత నువ్వు శీఘ్రమే రామలక్ష్మణులు ఇక్కడకు వచ్చే ఏర్పాటు చెయ్యి" అని అన్నది.

"ఓ దేవీ! వానర భల్లూక సేనలకు ప్రభువు అయిన సుగ్రీవుడు ఈ కార్యాన్ని సాధించటానికి కృతనిశ్చయుడు అయివున్నాడు. ఆ సుగ్రీవుని సన్నిధిలో నాతో సరిసమానమైనవారు నాకన్న అధికులు ఎంతోమంది వున్నారు. నా కన్న

తక్కువ అయినవారు ఒక్కరు లేరు. నేనే సముద్రాలన్ని దాటి వచ్చాను. అత్యంత సమర్థులను రాజు ఎప్పుడూ మొట్టమొదట చూచి రావటానికి పంపించడు. నాబోటి సామాన్యులనే పంపిస్తారు.మహాబలపరాక్రమవంతులైన వానర వీరులతో మహాతేజోవంతులు రామలక్ష్మణులు వచ్చి రావణాసురుణ్ణి సబాంధవంగా సంహారం చేసి నిన్ను అయోధ్యకు తీసుకువెళ్ళతారు" అని జానకీ దేవికి ధైర్యం చెప్పాడు.

ఆ బుద్ధిమంతుడు వాయుపుత్రుడు సీతామాతతో తనతో సమానులు. తనకన్న గొప్పవారేకాని, తన కంటే తక్కువవారు సుగ్రీవుని సన్నిధిలో లేరని చెప్పటం ఎంత ఆశ్చర్యకరం. సమయస్ఫూర్తితో కూడిన వాక్చాతుర్యము, నమ్రతతో, గూడిన వినయము హనుమంతునిలో ఈ సందర్భమున దివ్యంగా ప్రకాశించినవి.

అప్పుడు బుద్ధిమంతుడు హనుమంతుడు ఆనవాలుకు ఏదైన ఇవ్వ మన్నాడు. సీతామాత తన వస్త్రంలో ముడివేసుకొన్న ఒక చూడామణిని గుర్తుగా రామునకిచ్చే కోసం అంజనేయునకిచ్చింది. ఆమె ఒక గుర్తు వార్తను ఆయన గుర్తు కోసం చెప్పింది. అప్పుడు రామదూత హనుమంతుడు ఆమెకు ముమ్మారు ప్రదక్షిణం చేసి వినయంగా నమస్కరించాడు.

## అశోకవన ధ్వంసం

అపార బుద్ధిమంతుడు హనుమంతుడు సీతామాతను దర్శించిన తర్వాత యింకొన్ని విషయాలు ఆయనకు తోచాయి. లంకలో నలుమూలల చూడటము. రాక్షసబలాన్ని అంచనా వేయటం, తన శక్తిని వారికి కొంచెం చూపటం, రాక్షసుల మనస్సులో భయోత్పవం కలిగించటం. ఈ రాక్షసులు వద్ద సామదానభేదోపాయాలు పనికిరావు. ఒక్క దండోపాయమే ప్రయోగించాలి అనుకొని రమణీయంగా ఉండే అశోకవనాన్ని దావాగ్నిలో దగ్ధమైన అరణ్యంవలె ధ్వంసం చేసాడు.

## హనుమంతుడు 80వేల మంది కింకరులను వధించుట

రావణునికి ఈ విషయం తెలిసి అగ్గిమండాడు. ఎనుబదివేల మంది భయంకరులైన కింకరులను హనుమంతుని బంధించమని పంపాడు. ఆ రాక్షసవీరులు శూలాలు, పరిఘలు, ఖడ్గాలు మొదలైన ఆయుధాలు ధరించి

హనుమంతుని చుట్టుముట్టారు. అంతట భయంకర పరాక్రముడు మారుతాత్మజుడు వృద్ధుడు అయిపోయి వాయుదేవునివలె చెలరేగి, రాక్షస సైన్యం మీద విరుచుకుపడ్డాడు. చెట్లను, రాళ్ళను పెకలించి రాక్షసుల మీద విసిరాడు. ఇనుపగదతో వారినందరిని వధించాడు.

## జంబుమాలి వధ

ఇది విన్న రావణుడు ఆశ్చర్యపడ్డాడు. గొప్ప బలశాలి, ధీమంతుడైన ప్రహస్తుని కుమారుడైన జంబుమాలిని పంపాడు. జంబుమాలి గొప్ప ధనుస్సును తీసుకొని హనుమంతునిపై బాణవర్షం వర్షించాడు. మహావీర్యవంతుడు పరిఘాయుధాన్ని బలంగా జంబుమాలి రథంపై విసరి కొట్టాడు. ఆ దెబ్బకు రథము, గుర్రములు జంబుమాలితోసహా తుత్తునియులై పోయారు.

## మంత్రుల పుత్రులు ఏడుగురు హతమగుట

మహాబలవంతులు కింకరులు చచ్చిపోవటమే కాకుండా జంబుమాలి సంహారమున్ను రావణాసురుడు విన్నాడు. కోపంతో ఎర్రటి కన్నులు తిప్పుతూ అమిత బలవంతులు, మహాపరాక్రమవంతులు అయిన అమాత్య పుత్రులను హనుమంతుని మీదకి పొమ్మని ఆజ్ఞాపించాడు. ఆ మంత్రుల పుత్రులు ఏడుగురు హనుమంతునిపై సైన్యంతో విరుచుకు పడ్డారు. మహా బలపరాక్రమవంతుడు, మహాభయంకరముగా కేకలు వేస్తూ రాక్షసుల మీదకు అమిత వేగంతో దూకి కొందరిని అరచేతులతో చరిచాడు. కొందరిని పిడికిళ్ళతో పొడిచాడు. కొందరిని గోళ్ళతో చీల్చివేసాడు. సైన్యంతోసహా ఆ మంత్రుల పుత్రులను వధించాడు.

## సేనా నాయకులను వధించుట

హనుమంతుడు మంత్రిపుత్రులను చంపివేసిన వార్తవిని రావణుడు కృంగిపోయాడు. వీరులు, వాయువేగ సమానులు. సేనా నాయకులు అయిన విరూపాక్ష, యూపాక్షులను, దుర్ధనుడు, ప్రఘసుడూ, భాస్కకర్ణుడు అనే అయిదుగురుని హనుమంతుడని బంధించుడని పంపించాడు. ఆ మహా బలవంతులగు సేనానాయకులు మహాసైన్యంతో హనుమంతునిపై భీకరంగా పోరుసల్పినాడు. ఆ మహావీరుడు, మహాబలవంతుడు, ప్రచండ పరాక్రమ

వంతుడు హనుమంతుడు రాక్షస సేనా నాయకులనూ, వారి సైన్యాలను, వాహనాలను నాశనము చేసివేసి ప్రళయకాలంలో ఉగ్రుడు అయ్యే యముడు వలె అశోకబహిర్ద్వారము దగ్గర మళ్ళీ వచ్చే రాక్షసుల కోసము ఎదురు చూస్తూ నిలుచున్నాడు.

## అక్షయ కుమారుని వధ

ఈ దుర్వార్త విని రావణుడు క్రుద్ధుడయ్యాడు. మండే దీపం నుండి మంటతో కూడిన నూనె చుక్కలు క్రింద రాలినట్లు కృద్ధుడైన రావణుని నేత్రాల నుండి కన్నీటి చుక్కలు రాలాయి. మహాబల పరాక్రమవంతుడు, ఇంద్రతేజమును బోలినవాడు అయిన తన కుమారుడు అక్షయ కుమారుని హనుమంతుని పైకి యుద్ధానికి పంపాడు. ప్రళయ కాలాగ్నిలాగ వెలిగిపోతున్న హనుమంతుని తేజానికి ఆశ్చర్యపడ్డాడు. వారి యుద్ధానికి భూమి దద్దరిల్లింది. పర్వతాలు చలించాయి. వారి అసమాన పరాక్రమమునకు దేవతలు కూడా విస్మయం చెందారు. పోరు భీకరంగా చాలాసేపు జరిగింది. అప్పుడు మహాతేజోవంతుడు అక్షయ కుమారుణ్ణి రెండు పాదాలు గట్టిగా పట్టుకొని గరుత్మంతుడు మహాసర్పాన్ని త్రిప్పినట్లు గిరగిర త్రిప్పి అమితవేగంతో నేలమీద విసిరికొట్టాడు. అక్షయ కుమారుడు చేతులూ, మెడ, తొడలు, నడుము విరిగి దేహం నుండి నెత్తురు క్రక్కుతూ నేలమీద పడి మరణించాడు.

## ఇంద్రజిత్తుతో యుద్ధము

అక్షయ కుమారుని వధించిన హనుమంతుడు అలసట తెలియనివాడై, తరువాత ఎవరొస్తారో నిరీక్షిస్తున్నాడు. కుమారుని మరణవార్తవిని రావణాసురుడు ఉడికిపోతున్నాడు. రావణుడు రోషాగ్నితో మండిపడి తానే స్వయంగా హనుమంతుని బంధించుటకు బయలుదేరెను. మహాబల పరాక్రమవంతుడు రావణ కుమారుడు ఇంద్రజిత్తు తండ్రినాపి, "తండ్రీ! నేనా వానరుని పొగరణచి వచ్చెదనని ఆ కాంతివంతుడు, మహాబలవంతుడు ఇంద్రజిత్తు పర్వకాలములో మహాసముద్రమువలె హనుమంతుని మీదకు యుద్ధానికి బయలుదేరాడు. రథము మీద అతివేగంతో వస్తున్న ఇంద్రజిత్తును ఆ వీర్యవంతుడు హనుమంతుడు చూచి సింహనాదం చేసాడు. ఉభయులు అమిత యుద్ధవిశారదులు సహస్రకోటి

ఆశ్చర్యపడేటట్లు పోరాడారు. ఇంద్రజిత్తు హనుమంతునిపై జడివానలాగా శరవర్షం కురిపించాడు. చేతిలోని పరిఘాన్ని చక్రంలా త్రిప్పుతూ ఆంజనేయుడు వాని శరవర్షాన్ని చిన్నాభిన్నం చేసాడు. తన శస్త్రాలు వ్యర్థమైన తరువాత ఇంద్రజిత్తు హనుమంతునిపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం హనుమంతుని బంధించింది.

హనుమంతుడు నిశ్చేష్టుడయిన తరువాత రాక్షసులు ఆయన్ను తాళ్ళతో కట్టివేశారు. ఇతర బంధాలుంటే బ్రహ్మాస్త్రం నిలవదు. జారిపోయింది. రావణాసురున్ని కలవటానికి హనుమంతుడు బ్రహ్మాస్త్రానికి కట్టుబడినట్లు నటించాడు. ఐచ్ఛికంగా పట్టుబడిన హనుమంతుణ్ణి మంత్రి గణసమేతంగా కొలువుతీరి ఉన్న రావణాసురుని ముందు నిలిపాడు ఇంద్రజిత్తు.

## రావణ దర్బారులో హనుమంతుడు

రావణుడు, హనుమంతుడు గంభీరంగా ఒకరినొకరు సూక్ష్మనిరీక్షణ చేసుకొన్నారు. పరస్పరం బలపౌరుషాలను, శక్తిసామర్థ్యాలను అంచనా వేసుకొన్నారు. అన్యోన్యం ప్రభావితులైనారు. అప్పుడు హనుమంతుడు 'ఓ రాక్షస రాజా! నిన్ను కలుసుకోవాలని అభిప్రాయంతోనే అశోకవనాన్ని భగ్నం చేసాను. నేను మహా తేజోవంతుడైన శ్రీరామదూతని. సుగ్రీవుడు నన్ను నీ వద్దకు పంపాడు. మహామతీ! నీవు ధర్మతత్త్వాన్ని తెలిసినవాడివి. గొప్పగా తపస్సు చేశావు. పరస్త్రీని నీ యింటిలో పెట్టుకొనుట తగదు. జానకిని శ్రీరామునకు అప్పగించు. అధర్మాచరణంతో నీవు ఐశ్వర్యాన్ని, జీవితాన్ని పాడుచేసుకొనవద్దు. సీతను నీవు ఇవ్వకపోతే స్వయంగా ఆమె తేజస్సుతోను, శ్రీరాముని క్రోధాగ్నిలోను నీ నగరం మొత్తం భస్మం కావటం తథ్యం అని గంభీరంగా హనుమంతుడు పలికాడు. హనుమంతుని సంభాషణం ధీర గంభీరంగాను, నిర్ణయంగాను, సత్యయుక్తంగాను వుంది. కానీ అహంకారి రావణునకు రుచించలేదు. ఈ వానరుణ్ణి వధించండంటూ' భటులను ఆజ్ఞాపించాడు.

ఆ సభలోనున్న రావణాసురుని తమ్ముడు విభీషణుడు లేచి, దూతను చంపుట రాజధర్మముకాదని, దూతను అంగభంగం చేసి శిక్ష విధించాలిగాని వధించటం తగదు అంటూ శాస్త్రం ఆదేశిస్తుంది అని అన్నాడు. విభీషణుని మాటలాలకించి రావణాసురుడు హనుమంతుని తోకకు నిప్పు అంటించి

కాల్చండని భటులకు అజ్ఞాపించాడు. రాక్షసులు అతని తోకకు గుడ్డలు చుట్టి, నూనె పోసి నిప్పు అంటించారు.

## లంకా దహనం

మహాధైర్యవంతుడు హనుమంతుని ఆగ్రహం, ఆవేశం కట్టులు తెగింది. తన తోకతో రాక్షసులను మర్దించాడు. రాక్షసుల గృహాలను లంకా నగరాన్ని జ్వలిస్తూ వుండే తన వాలంతో భస్మం చేసాడు. లంకా నగరం మొత్తం పెడబొబ్బలతో నిండిపోయింది.

సీతామాత సందర్శనంతోను, లంకా దహనంతోను ఉప్పొంగిపోయిన మహాపరాక్రమవంతుడు అమితవేగంతో మరల సముద్రము దాటి అంగద, జాంబవంతులకు ఆ సంతోషవార్త చెప్పి, వానరులతోసహా శ్రీరాముని సన్నిధికి చేరాడు.

## శ్రీరాముడు హనుమంతుని ఆలింగనం చేసుకొనుట

మహా మేధావంతుడు హనుమంతుడు దూరం నుంచే "దృష్టా సీతా" అనుకుంటూ వచ్చాడు. హనుమంతుని మాటలు రామలక్ష్మణులను సంతోష సముద్రములో ముంచెత్తాయి. జరిగిన సంఘటనలన్నింటినీ హనుమంతుడు సవివరంగా కళ్ళకు కట్టినట్లు రామలక్ష్మణులకు వర్ణించి చెప్పాడు. చూడామణి నిచ్చి నమస్కరించాడు. అప్పుడు శ్రీరాముడు ఆనందముతో ఆనంద బాష్పాలు రాలుస్తూ కృతజ్ఞతాపూర్వకంగా హనుమంతుని ప్రేమతో ఆలింగనం చేసుకొన్నాడు.

వానర ప్రభువు సుగ్రీవుని వానర భల్లూక, మహాసైన్యంలో ఆ మహా తేజస్వి హనుమంతుడు ఒక్కడే భగవత్ స్వరూపుడు. శ్రీరామ ప్రభువు వారి కార్యాన్ని సాధించి ఆలింగన భాగ్యం పొందాడు.

## సూర్యవంశ సంజాతుడు శ్రీరాముడు, చంద్రవంశంలో ద్వాపర యుగంలో కృష్ణునిగా జన్మించుటకు సంకల్పించుకొనుట

ఆ సత్య సంపన్నుడు హనుమంతుడు శ్రీరామచంద్రునితో లంకలో సీతాన్వేషణ సమయంలో చంద్రుడు మహాతేజస్సుతో ప్రకాశించి తనకు ఎంతో

తోడ్పడినాడని చెప్పాడు. చంద్రుడు హనుమంతునకు చేసిన సహాయమునకు కృతజ్ఞతగా ద్వాపరయుగంలో చంద్రవంశంలో కృష్ణుడుగా జన్మించవలెనని సంకల్పించినాడు ఆ సత్యసంధుడు శ్రీరామచంద్రుడు.

## ఆ మహాతేజోవంతుడు హనుమంతుడు లంకలో భయంకర రాక్షసులతో భీకర పోరాటము

ఆ కపి శార్దూలము, శ్రీరామ దూత లంకాధి దేవత లంకిణిని ముష్టి యుద్ధాలతో పరాభవించాడు. సుందరమైన అశోకవనములోని మహావృక్షాలను వేళ్ళతో సహా పెళ్ళగించి ధ్వంసం చేసాడు. మహాబలవంతులు అయిన ఎనుబది వేలమంది కింకరులను కొట్టి వధించాడు. అమిత బలవంతుడు, మహాకాయుడు అయిన జంబుమాలిని హతమార్చాడు. వీర్యవంతులు, మహాపరాక్రమవంతులు అయిన అమాత్య పుత్రులు ఏడుగురిని సైన్యంతో సహా సంహరించాడు. వీరులు వాయువేగసమానులైన అయిదుగురు సేనా నాయకులను ససైన్యంగా అతి దారుణంగా వధించాడు. యుద్ధోన్మత్తుడు అమిత పరాక్రమవంతుడయిన రావణాసురుని కుమారుడు అక్షయ కుమారుని పాదములు పట్టి గిరగిరా త్రిప్పి నేలకేసి కొట్టి సంహరించాడు. అమిత బలవంతుడు. దేవతలవంటి పరాక్రమ వంతుడు, మాయా యుద్ధవిశారదుడు అయిన రావణాసురుని కుమారుడు ఇంద్రజిత్తుతో భీకర పోరాటం జరిపాడు. తన వాలంతో లంకనంతా కాల్చాడు. తన ప్రభువు రామునికంటే మిన్నగా కేవలము ఇనుప గడియతో, గోళ్ళతోను, వృక్షాలతోను హనుమంతుడు ఒక్కడే రాక్షస సంహారం చేసాడు. రామునికన్న రామనామం గొప్పది. రామనామంకన్న భక్తుడు గొప్పవాడని ఋజువు చేసాడు హనుమంతుడు. సుందరకాండ మణిహారంలో కలికిపూస వంటివాడు.

హనుమంతుడు సముద్రముదాటి సీతను చేరు విధానము భవ సాగరమును దాటి జీవుడు పరమాత్మను చేరుటగాను ఉపాయము ఉపదిష్ట మగుచున్నది.

## సుందరకాండకు చమత్కార వివరణ

**అంచిత చతుర్ధజాతుడు**
**పంచమ మార్గమున నేగి ప్రథమ తనూజన్**

గాంచి తృతీయం ఒప్పుగ
నుంచి ద్వితీయంబు దాటి యొగిన్నపు గాంచెన్

**పంచభూతములు :**

1. భూమి  2. నీరు  3. అగ్ని  4. గాలి  5. ఆకాశము

**మూలభావము :** పంచభూతములను వరుస క్రమములో లెక్కించినచో అందులో చతుర్థజాతుడు అనగా నాల్గవవాడైన వాయుదేవుని కుమారుడైన ఆంజనేయుడు సీతాన్వేషణమునకు పంచమ మార్గంబున నేగి, అనగా పంచభూతములలో ఐదవదియైన "ఆకాశ" మార్గంబు గుండా వెళ్ళి లంకలో ప్రవేశించి ప్రథమ తనూజన్‌గాంచి అనగా పంచభూతములలో ప్రధముడైన "భూమాత" యొక్క కుమార్తెయైన సీతమ్మను జూచి తృతీయం ఒప్పగ నుంచి అనగా పంచభూతములలో మూడవదియైన "అగ్ని"చే ఆ లంకాపురిని దహింపజేసి, ద్వితీయంబు దాటి అనగా పంచభూతములలో రెండవదియైన "నీరు" అనగా సముద్రము దాటి వచ్చి మహదానందముతో అతి వినయ విధేయతలతో తన ప్రభువగు శ్రీరామ చంద్రమూర్తిని సందర్శించెను.

**భావము :** రామాయణ మహాకావ్యములో అతి ముఖ్యమైనటువంటిన్ని, మహా రసవత్తరమైనటువంటిన్ని, అతి సుందరమైనటువంటిదిన్ని, అయిన సుందర కాండను నిత్యపారాయణగా చేయుదురు. అంత విశిష్టత మహిమా విశేషము, దీనియందు ఉండటంచేతనే యిది రామాయణమునకు మకుటాయమాన మైనది. ఈ ఘట్టమునకు శ్రీ ఆంజనేయస్వామి ప్రధానపాత్రధారియైయున్నాడు. ఆంజనేయుడు సీతాన్వేషణమునకు బయలుదేరి వెళ్ళినది లగాయతు తిరిగివచ్చి రామచంద్రమూర్తిని సందర్శించినంతవరకు గల కథలో అనేకమైన రసవత్తరమైన ఘట్టములు మనకు గోచరించును. ఆ ముఖ్యమైన ఘట్టములను సూత్రప్రాయంగా పంచభూతములను ఆధారము చేసుకొని యొక మహానుభావుడు చిన్న పద్యములో ఆ భావము పొందుపరిచాడు.

## సీతమ్మవారికి రామ, లక్ష్మణుల అంగ సాముద్రిక లక్షణములు వివరించిన దివ్యలీలలు

"కీదృశంతస్య సంస్థానం రూపం రామస్యకీదృశమ్
కథమూరూకథం బాహులక్ష్మస్యచశం సమే"

ఆ కామరూపుడు హనుమంతుడు రామదూతయో లేక రావణుని మరియొక వేషమో నిశ్చయింపదలచి సీతామాత ఆ వానరశ్రేష్ఠుని రామ, లక్ష్మణుల అవయవ లక్షణములు వర్ణింపుమని అడిగెను.

ఆ మహాపండితుడు హనుమంతుడు సాముద్రికశాస్త్ర ప్రవీణుడు గాన బాహ్య అవయవములనుసరించి రహస్య అవయవములు పొందిక వుండును. గనుక సీతామాతకు తృప్తికరంగా రామలక్ష్మణుల బాహ్య రహస్య అవయవములు, సాముద్రిక లక్షణములు వర్ణించి చెప్పాడు.

## సాముద్రిక లక్షణముల వర్ణన

విపులాం సోమహాబాహుః కమ్బుగ్రీవః శుభాననః
గూఢజత్రుః సుతామ్రాక్షో రామోదేవిజనైః శ్రుతః"

శ్రీరాముడు వెడల్పైన మూపులు గలవాడు. అజానుబాహువు. శంఖము వంటి కంఠము గలవాడు. అందమైన ముఖము గలవాడు. ఎముకలుపైకి కనపడని సంధులు గలవాడు. ఎఱ్ఱనైన కన్నులు గలవాడు.

"చతుర్దశ సమద్వన్ద్వశ్చ తుర్దంష్ట్రశ్చ తుర్గతిః
మహోష్ఠ హనునాసశ్చపఞ్చస్నిగ్ధోష్ఠ వంశవాన్"

## పదునాలుగు జంటలు సమానముగా గలవు.

కనుబొమలు, ముక్కుపుటములు, చెవులు, పెదవులు, చనుమొనలు, మోచేతులు, మణికట్టులు, మోకాళ్ళు, వృషణములు, కటి ప్రదేశములు, కాళ్ళు, పిరుదులు.

నాలుగు దంతములు కలవాడు. సింహము, ఏనుగు, పెద్ద పులి, ఆంబోతు అను నాలుగింటివంటి నడకవంటి నడకగలవాడు. మూడు పెద్దవిగా గలవాడు. (పెదవులు, చెక్కిళ్ళు, ముక్కు) అయిదునున్ననై మెఱయుచుండునవి కలవాడు. కన్నులు, పండ్లు, చర్మము, పాదములు, వెంట్రుకలు ఎనిమిదింటి నిడుదలైన వాడు. వీపు, దేహము, వేళ్ళు, చేతులు, ముక్కు, వేళ్ళు, చెవులు, గుహ్యావయవము.

"దళపద్మోదశ బృహత్రి భిర్వ్యా పాది శుక్లవాన్
షటున్నతోనవ తనుస్త్రిభిర్వ్యాప్నోతి రాఘవః"

**పది అవయవములు పద్మాకారముగా గలవాడు :**

ముఖము, కన్నులు, నోరు, పెదవులు, దవడలు, స్తనములు, గోళ్ళు, అరచేతులు, పాదములు, నాలుక.

**పది ఎత్తైన అవయవములు గలవాడు :**

శిరము, నుదురు, రొమ్ము, కంఠము, బాహువులు, మూపులు, బొడ్డు, పిరుదులు, కడుపు, కాళ్ళు.

**మూడింటిని పొంది యుండువాడు :** తేజస్సు, యశస్సు, శోభ.

**రెండు తెల్లనైనవి గలవాడు :** కళ్ళు, దంతములు

**ఆరు ఉన్నతమైనవి గలవాడు :**

కక్షము, వక్షము, కుక్షి, ముక్కు, మూపు, లలాటము.

**తొమ్మిది సూక్ష్మమైనవి గలవాడు :**

వేళ్ళ కణుపులు, కాళ్ళు, చేతులు, తల, మాసము శరీరమునగల వెంట్రుకలు, చర్మము, గుహ్యావయవము, బుద్ధి, చూపు.

**మూడింట వ్యాపించి యుండువాడు :**

త్రికాలమందు ధర్మార్థకామములచే శ్రీరాముడు శ్యామవర్ణుడు, లక్ష్మణుడు బంగారు మేనిఛాయగలవాడు.



# రామరావణ యుద్ధములో వీరాంజనేయుడు ప్రదర్శించిన బలపరాక్రమములు

రామ రావణ మహాసంగ్రామములో ప్రధమ సంకుల సమరంలో వానర వీరులు విజృంభించి రాక్షస మూకలను చీల్చి చెండాడారు. హాహాకారాలు చేస్తూ రాక్షసులు నేలకూలుతున్నారు.

మహావీరుడు అంగదుడు, ఇంద్రుణ్ణి ఓడించిన ఇంద్రజిత్తుతో భయంకరంగా పోరాడి హింసించాడు. అంగదునితో యుద్ధములో పరాభవము పొందిన ఇంద్రజిత్తు ఆకాశంలోకి ఎగిరి తాను కనపడకుండా చాటున మాటేసి ధర్మవిరుద్ధంగా రామలక్ష్మణులను బాణాలతో గాయపరచి, వారిని నాగాస్త్రాలతో బంధించాడు. రామలక్ష్మణులు కదలలేకపోయినారు. రామ, లక్ష్మణులు నాగాస్త్ర బందీలై పడిపోగానే వారు మరణించారని సంతోషంతో ఇంద్రజిత్తు లంకలోకి వెళ్ళి రావణునికి చెప్పాడు. రావణాది రాక్షసులు ఆనందంతో ఓలలాడారు.

రామలక్ష్మణుల స్థితికి వానరులు విచారిస్తున్నారు. ఆ సమయంలో గరుడుడు వచ్చి రామ లక్ష్మణులను నాగాస్త్రముల నుండి విడిపించాడు. వారిని యుద్ధానికి పురిగొల్పాడు. అప్పుడు వానరులు ఆనందంతో సింహనాదం చేసి, రణభేరి మ్రోగించారు. రామ లక్ష్మణులు భయంకరమైన నాగాస్త్ర బంధనం నుండి విముక్తులైనట్లు రావణాసురుడు విని భయపడ్డాడు.

## ధూమ్రాక్షుడు హనుమంతునిచే హతుడగుట

రావణాసురుడు అమిత బలవంతుడైన ధూమ్రాక్షుని యుద్ధానికి పంపాడు. ధూమ్రాక్షుడు వానరులపై శరవర్షం కురిపించాడు. వానరులు భయకంపితులై పరుగులెత్తారు. అది చూచి మహాపరాక్రమవంతుడు హనుమంతుడు పెద్ద బండ నెత్తుకుని ధూమ్రాక్షునిపైకి ఉరికాడు. ధూమ్రాక్షుడు పెద్ద గదను హనుమంతునిపైకి విసిరాడు. యుక్తిపరుడు హనుమంతుడు దాన్ని తప్పించుకొని వెంటనే పర్వతము వంటి పెద్ద బండనెత్తి ధూమ్రాక్షునిపై పడేశాడు. ఆ దెబ్బకు ధూమ్రాక్షుడు పెద్ద కొండలాగా నేలపై కూలిపోయాడు. హనుమంతుడు ఆనందంతో సింహనాదం చేశాడు. వానరులు సంతోషముతో

హనుమంతునకు ప్రదక్షిణ నమస్కారములు చేశారు. ఇది హనుమంతుని ప్రథమ విజయము. ధూమ్రాక్షుని మరణవార్త విన్న రావణాసురుడు పాములాగా బుస కొట్టాడు. వెంటనే శూరుడైన వజ్రదంష్ట్రుని వానరులపైకి యుద్ధానికి పంపాడు.

## వజ్రదంష్ట్రుడు అంగదునిచే హతమగుట

వజ్రదంష్ట్రుడు రాక్షస సైన్యంతో వానరులపై విరుచుకు పడ్డాడు. అంగదుడు భీకరంగా పోరాడి వజ్రదంష్ట్రుని వధించాడు.

## అకంపనుని హనుమంతుడు వధించుట

వజ్రదంష్ట్రుడు హతుడగుట విని రావణాసురుడు కలత చెందాడు. అమిత శౌర్యవంతుడు, సర్వశస్త్రాస్త్రములు తెలిసినవాడునైన అకంపనుడు యుద్ధానికి పంపాడు. యుద్ధమందు దేవతలైనను గదలింపలేరు కావున అకంపనుడని ప్రసిద్ధి చెందాడు.

అకంపనుడు విజృంభించి వానర వీరుల్ని చాలామందిని హతమార్చాడు. వానరులు తట్టుకోలేకపోయారు. అది చూచిన హనుమంతుడు అకంపనుని ఢీ కొన్నాడు. హనుమంతునిపై అకంపనుడు శరవృష్టిని కురిపించాడు. బాణ వర్షము లక్ష్యము చేయక హనుమంతుడు ఒక పర్వత శిఖరాన్ని అకంపనుని పైకి విసిరాడు. అకంపనుడు హనుమంతుడు విసిరిన పర్వత శిఖరాన్ని బాణంతో ఛేదించాడు. హనుమంతుడు క్రుద్ధుడై మద్ది చెట్టు నొకదానిని పెకలించి, బలంగా అకంపనుడు తల బ్రద్దలగునట్లు కొట్టగా ఆ రాక్షసుడు నేలపైబడి మరణించాడు. రామలక్ష్మణ, సుగ్రీవ, విభీషణాదులు హనుమంతుని శ్లాఘించారు.

## ప్రహస్తుని నీలుడు వధించుట

అకంపనుడు హతుడగునట్లు విని రావణుడు దిగులుపడ్డాడు. తన సేనాని ప్రహస్తుని యుద్ధానికి పంపాడు. రావణుని సేనానాయకుడు ప్రహస్తుడు. గొప్పసేనతో వానరులపై పడ్డాడు. వానర సేనానాయకుడు నీలుడు ప్రహస్తునితో భయంకరంగా పోరి ప్రహస్తుని హతమార్చాడు.

# రామ, రావణుల తొలి యుద్ధము

ప్రహస్తుని మరణవార్త విని రావణుడు అమితంగా దుఃఖించాడు. ధైర్యము కూడగట్టుకొని తానే స్వయంగా సేనా నాయకులతోను యుద్ధానికి బయలుదేరాడు. సింహనాదాలు చేస్తూ, విజయఘోషలు పలుకుతూ రావణుని సైన్యం వానరులపై విరుచుకు పడింది. రావణుడు వానరులపై శరవర్షం కురిపించాడు. సుగ్రీవుడు పెద్ద పర్వతాన్ని చేతపట్టుకొని రావణునిపై విసిరాడు. రావణుడు ఆ పర్వత శిఖరాన్ని ఛేదించి సుగ్రీవునిపై సర్పబాణాన్ని సంధించాడు. ఆ శరఘాతానికి సుగ్రీవుడు మూర్ఛిల్లాడు.

# హనుమద్రావణుల ముష్టి యుద్ధం

అమితబల పరాక్రమవంతుడు హనుమంతుడు రావణునితేరుపై దుమికి వేగముగా కుడిచేయినెత్తి "ఓరీ! ఇదిగో నా కుడిచేయి చూడుము. ఐదు వేళ్ళతో గూడినది పంచభూతాలతో తయారైన నీ దేహం నుండి నిన్ను వేరు చేసేందుకే" అన్నాడు హనుమంతుడు.

అప్పుడు రావణుడు వానరా! నీ బలమెంతమాత్రమో చూచెద. కొట్టుము. రావణుడంతటి వారిని హనుమంతుడు కొట్టెనని కీర్తి సంపాదింపుము. నీవు కొట్టిన వెనుక నీ శౌర్యమే మాత్రమో చూచి నిన్ను చంపెదను అని పలికాడు. అంత హనుమంతుడు రావణా నా శౌర్యమెట్టిదో నాచేత జచ్చిన నీ కొడుకులను దలచుకొని యూహింపుమన్నాడు. హనుమంతుని మాటలు రావణునిలో పౌరుషాన్ని రెచ్చగొట్టాయి. అరచేతితో హనుమంతుని కొట్టాడు. ఆ దెబ్బకు హనుమంతుడు మిగుల బాధచెంది తూలిపోయాడు. వెంటనే తేరుకొని రావణుని బలంగా అరచేతితో కొట్టాడు. ఆ దెబ్బకు రావణుడు భూకంపం వచ్చినప్పుడు పర్వతము అదిరినట్లు కంపించి స్పృహకోల్పోయాడు. స్పృహరాగానే రావణుడు "వానరా! నీ శక్తికి మెచ్చాను. నీ పరాక్రమానికి శత్రువు అయినా మనసారా మెచ్చు కుంటున్నానన్నాడు. రావణుని మాటలు విని హనుమంతుడు ఇలా పలికాడు. "రావణా! ఏల నన్ను మెచ్చెదవు. యిది యేమి పోటు. నా దెబ్బ తిని నీవు బ్రతికేయున్నావు. నీ భుజబలంతో మరలా నన్ను గ్రుద్దుము. ఆవలన నా భుజబలముతో నిన్ను గ్రుద్ది చంపెదనన్నాడు.

అప్పుడు రావణుడు కోపముతో గన్నులెఱ్ఱచేసి మండిపడుచు తన శక్తికొలది హనుమంతుని రొమ్మును కుడిచేతి పిడికిటపెట్టి కొట్టాడు. ఆ దెబ్బకు హనుమంతుడు తబ్బిబ్బిలాడుచుండగా దెప్పరిల్లిన తన్ను జంపునని భయపడి వేగంగా రావణాసురుడు నీలుని మీదకు పోయెను.

హనుమంతుడు స్మృతిగలవాడై నీలునితో పోరాడుతున్న రావణునిజూచి ఆ సమయము తప్పెను గదా! పగవాడు మరియొకనితో యుద్ధము చేయు చుండగా నేను బోవుట మర్యాదకాదని తలచి యూరకుండెను.

## ఇచ్చట ధర్మసూక్ష్మం ఉన్నది

ఇంద్రజిత్తు అదృశ్యముగా వుండి ధర్మాత్ములైన రామలక్ష్మణులను నాగపాశంతో బంధించాడు. మహాజ్ఞాని హనుమంతుడు నీలునితో యుద్ధము చేస్తున్న దురాత్ముడైన రావణాసురుని కొట్టటం అధర్మమని తనను తాను నిగ్రహించుకొన్నాడు.

రావణాసురుడు నీలునితో భయంకరంగా పోరాడి నీలుని జయించి, లక్ష్మణుని ఢీ కొన్నాడు. రామ, లక్ష్మణులు ఒకరికి ఒకరు తీసిపోకుండా భీకరంగా పోరుసల్పారు. చివరకు రావణుడు శక్తి బాణంతో లక్ష్మణుని మూర్ఛిల్ల చేసాడు.

## హనుమంతుడు రావణాసురుని బాధించుట

అప్పుడు హనుమంతుడు పరుగెత్తుతూ వచ్చి తీవ్రమైన కోపంతో పిడికిలి బిగించి రావణుని గుండెపై బలంగా గుద్దాడు. ఆ దెబ్బకు రావణుని నేత్రాల నుండి, చెవుల నుండి రక్తం స్రవించింది. కదలలేక తన రథంలో కూలబడ్డాడు రావణుడు. మూర్ఛపోయిపడిన దశకంఠుని జూచి వానరులు, ఋషులు, దేవతలు సంతోషించి హనుమంతుని శ్లాఘించారు.

## రామ, రావణ ప్రథమ సంగ్రామము

రావణునికి స్పృహ వచ్చింది. ధనస్సు చేతపట్టుకొని యుద్ధానికి సంసిద్ధుడయ్యాడు. అది చూచి హనుమంతుడు రామునితో "రామా! విష్ణుమూర్తి గరుడునిపై ఎక్కి దేవతలను జయించినట్లు, నీవు నీ వీపు మీద ఎక్కి రావణుని

వధించుమన్నాడు. రాముడు సంతోషముతో హనుమంతుని వీపుపై ఎక్కాడు. హనుమంతుడు ఆనందంతో పరవశించిపోయాడు.

రామ, రావణులు భీకరంగా పోరు సల్పుతున్నారు. రావణాసురుడు రాముని వాహనమైన హనుమంతుని ప్రళయ కాలాగ్నితో సమానమైన బాణములచే గొట్టి బాధింపగా నతని స్వభావ తేజమంతకంతకు హెచ్చెను. రావణుని బాణములచే గాయపడిన హనుమంతుని జూచి రామచంద్రమూర్తి కోపించిన వాడై రావణాసురునిపై భయంకర శరవర్షం కురిపించాడు. వజ్రాయుధంతో సమానమైన బాణాన్ని రావణుని వక్షస్థలంపై నాటాడు. రావణాసురుడు రామ బాణముల వలన బాధచే మిక్కిలి విలపించి విల్లును నేలపై జారవిడిచాడు. ఆ దయామయుడు రాముడు రావణునితో "రావణా! యుద్ధంలో బాగా అలసి పోయావు లంకలోకి వెళ్ళి సేద తీర్చుకొని మరల యుద్ధానికి రమ్మని వదలి పెట్టాడు రావణుని.

## కుంభకర్ణుడు కూలిపోవుట

రావణుని అహంకారం అణగారింది. లంకలో ప్రవేశించాడు. మహాబల పరాక్రమ వంతుడు, పర్వతాకారుడగు తన సోదరుడు కుంభ కర్ణుని నిద్ర లేపి యుద్ధానికి పంపాడు. ఆ కుంభకర్ణుడు శూలము ధరించి ప్రళయ కాల యముని వలె విజృంభించి పెక్కుమంది వానరవీరులను హతమార్చాడు, భక్షించాడు. అప్పుడు మహా బల సంపన్నుడు శ్రీరాముడు క్రోధముతో ఇంద్రాస్త్రముతో కుంభకర్ణుని హతమార్చాడు.

## రణరంగములో రావణాసురుని పుత్రులు

కుంభకర్ణుని మరణవార్త విని రావణాసురుడు ఎంతో కృంగిపోయాడు. విపరీతంగా బాధపడ్డాడు. ఆ సమయంలో రావణుని కుమారుడు అమిత పరాక్రమవంతుడు త్రిశిరుడు, దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు వానరులపై యుద్ధానికి ఉత్సాహంగా బయలుదేరారు. అప్పుడు రావణాసురుడు తన పుత్రులకు తోడుగా తన సోదరులు మహోదర, మహాపార్శ్వులను యుద్ధానికి పంపాడు. వానర రాక్షస సంగ్రామములో అంగదుడు నరాంతకుని, హనుమంతుడు

దేవాంతకుని, త్రిశిరులను నీలుడు, మహోదరుని ఋషభుడు మహాపార్శ్వుని, లక్ష్మణుడు అతికాయుని హతమార్చారు.

## ఇంద్రజిత్తు వానరసైన్యంపై బ్రహ్మాస్త్ర ప్రయోగము

రావణుడు తన పుత్రులు, సోదరులు మరణించిన వార్త విని అమితంగా దుఃఖించాడు. అప్పుడు ఇంద్రజిత్తు క్రోధంతో రాక్షస సేనతో వానరులపై యుద్ధానికి వెళ్ళాడు. రాక్షస వానరుల మధ్య భీకరంగా పోరుసాగుతుంది. ఇంద్రజిత్తు అదృశ్యంగా యుండి వానరులపై భయంకరమైన బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు.

బ్రహ్మాస్త్ర ప్రభావము వలన వానరసైన్యం అంతా స్పృహతప్పారు. పెక్కుమంది వానరులు హతులయ్యారు. రామలక్ష్మణులు మూర్ఛిల్లారు. అది జూచి ఇంద్రజిత్తు ఆనందంతో, విజయోత్సాహంతో లంకా నగరంలోకి వెళ్ళాడు.

బ్రహ్మాస్త్రము నుండి మొదట విముక్తులైన హనుమంతుడు, విభీషణుడు, వయోవృద్ధుడైన జాంబవంతుని అన్వేషించారు. విభీషణుడు జాంబవంతుని కనుగొని కుశలమడిగాడు. బాణాల దెబ్బలతో దేహమంతా శిథిలమైన జాంబవంతుడు మెల్లగా "నాయనా! విభీషణా! హనుమంతుడు బ్రతికియున్నాడా?" అని అడిగాడు.

మహాత్మా! జాంబవంతా! రామలక్ష్మణులను, రాజైన సుగ్రీవుడు, యువరాజైన అంగదుడు, క్షేమముగా ఉన్నారాయని యడుగక హనుమంతుడు బాగున్నాడాయననేల వాస్తవముగ నీకు హనుమంతుని మీదనున్న ప్రేమ రాజకుమారులయందుగాని బాలుడగు అంగదుని యందుగాని ప్రభువైన సుగ్రీవుని మీద లేదు. ఏమి కారణము? అని విభీషణుడు అడిగాడు.

మిత్రమా విభీషణా! హనుమంతుడు గమనమున వాయుదేవునితో సమానము. హనుమంతుడు ఒక్కడే బ్రతికియుంటే మన మందరం బ్రతికినట్లే. మన వీరులందరు చంపబడినా బ్రతికియున్నట్లే అని జాంబవంతుడు చెప్పాడు.

ప్రక్కనేఉండి జాంబవంతుని మాటలు వింటున్న హనుమంతుడా పుణ్యాత్ముని పాదములపై వ్రాలి, తండ్రి నేనే హనుమనన్నాడు. హనుమంతుని మాటలు వినగానే పునఃజన్మ లభించినట్లుగా జాంబవంతుడు భావించి

హనుమంతుని దగ్గరకు తీసుకొని ఇలా పలికాడు. "ఆంజనేయా! నీతో సమానుడగు బలవంతుడులేడు. నీవు లోకోన్నత శౌర్యశాలివి. నీయధిక పరాక్రమం జూపవలసిన సమయం వచ్చింది. వానరులను, భల్లూకములను, రామలక్ష్మణులను అప్తుడవై నీవే వారిని ఆదుకొని రక్షించాలి.

"నాయనా హనుమా! సముద్రము దాటి హిమాలయానికి వెళ్ళాలి. అక్కడ సువర్ణమయమైన ఋషభ పర్వతాన్ని ఎక్కితే నీకు కైలాస శిఖరం కనబడుతుంది. ఆ రెండు కొండల నడుమ దేదీప్యమానంగా వెలిగిపోతూ ఔషధాలతో నిండిన మూలికల కొండగలదు. ఆ పర్వతముపైన నధికమైన కాంతులచే దిక్కులు వెలిగించు నాలుగు మూలికలు గలవు. వాని కాంతులచే నీవు వాటిని గుర్తించగలవు. అందు "మృతసంజీవిని" (చచ్చినవారిని బ్రతికించునది) "విశల్యకరణి" దేహమున నాటిన బాణముల ములుకులు, పదార్థములు నూడదీయునది. "సావర్ణ్యకరిణి" గ్రామములతో వన్నె మాఱినచోట మరల వన్నె వచ్చినట్లు చేయునది. "సంధానకరణి" విరిగిన ఎముకలను, అవయవములను మరల గఱుచుకొనునట్లు చేయునది. ఇవి నాలుగు మూలికలు. ఆ నాలుగు మూలికలను నీవు తొందరగా తీసుకురావాలి. వానరులకు ప్రాణ దాతవు కావాలి" అని ప్రోత్సహించాడు.

## సంజీవి పర్వతము తెచ్చిన అద్భుతలీల

ఆ మహాబల సంపన్నుడు హనుమంతుడు జాంబవంతుని మాటలు వినగానే ఉత్సాహంతో రివ్వున ఆకాశంలోకి ఎగిరాడు. ఆకాశ మార్గాన సంజీవిని చేరాడు. ఆ కొండమీదనున్న ఔషదాలు కనిపించకుండా పోయినవి. హనుమ కోపంతో సంజీవ పర్వతాన్ని పెకలించి చేతబూని వాయువేగంలో లంక చేరాడు. గిరిశిఖరంచేతిలో పెట్టుకొని దిగుతున్న హనుమ వజ్రహస్తుడైన దేవేంద్రునిలా, చక్రం ధరించిన విష్ణుమూర్తిలా కనిపించాడు. ఆ మూలికల వాసన చూచి రామ లక్ష్మణులు లేచి తెప్పరిల్లారు. వానరులందరు గుంపులుగా లేచారు. వానరులంతా బ్రతికారు. రాక్షసులు ఒక్కరూ బ్రతకలేదు. యుద్ధం ప్రారంభమయినది మొదలు వానరులచే చచ్చిన రాక్షసులనునప్పుడప్పుడే రావణుడు చచ్చినను శత్రువులకు జిక్కుటయగౌరవమని సముద్రములో పడవేయించాడు. అందు

వలన వారు బ్రతుకుటకు వీలులేకుండా పోయింది. వానరసేనలో అందరు మూర్ఛ నుండి తేరుకొనగానే ఆ సంజీవ పర్వతాన్ని యథాస్థానంలో వుంచాడు. వానరవీరుడు ఉత్సాహంతో సింహనాదాలు చేశారు.

సమరోత్సాహంలో ఉన్న వానరవీరులు బండలను, పర్వత శిఖరాలను, వృక్షాలను చేత పుచ్చుకొని రాక్షసులను తీవ్రంగా హింసించారు.

రావణుని క్రోధం పెరిగిపోయింది. కుంభకర్ణుని కుమారులు కుంభ, వికుంభాదులను యుద్ధానికి పంపాడు. వారికి సహాయంగా కంపనుడు, శోణితాక్షుడు, యూపాక్షుడు, ప్రజంఘుడు మొదలగు రాక్షసవీరులను పంపాడు. రాక్షసులు గొప్ప, గొప్ప ఆయుధాలు చేతబట్టి వానరులతో యుద్ధానికి కలియబడ్డారు.

ఆ భయంకర సంకుల సమరంలో అంగదుడు కంపనుని, ప్రజింఘుని హతమార్చాడు. అంగదుని మేనమామ అయిన ద్వివిదుడు, శోణితాక్షుని, మైందుడు యుపాక్షుని వధించారు.

## కుంభుడు - నికుంభుడు - మకరాక్షుడు

సుగ్రీవుని ముష్టిఘాతాలకు కుంభుడు మరణించాడు.

నికుంభుని హనుమంతుడు పిడికిలితో కొట్టి క్రింద పడవేసి మీదపడి మెడత్రిప్పి శిరస్సును త్రుంచేసాడు. శ్రీరాముడు ఆగ్నేయాస్త్రంతో ఖరుని కుమారుడు మకరాక్షుని వధించాడు.

## ఇంద్రజిత్తు మరణం

ఇంద్రాది దేవతలను ఓడించిన అతి బలపరాక్రమవంతుడు ఇంద్రజిత్తు వానర సైన్యాలపై విరుచుకుపడ్డాడు.

శ్రీరాముడు లక్ష్మణుణ్ణి ఆశీర్వదించి ఇంద్రజిత్తుపై యుద్ధానికి పంపాడు. లక్ష్మణ, ఇంద్రజిత్తులు భయంకరంగా పోరాడారు. చివరకు లక్ష్మణుడు ఇంద్రాస్త్రంతో ఇంద్రజిత్తును సంహరించాడు. ఇంద్రజిత్తు మరణంతో రాక్షసులు భీతి చెందారు. వానరులు సంతోషంతో సింహనాదాలు చేశారు.

ఆ మహాశూరుడు, తన ప్రాణతుల్యుడు కుమారుడు ఇంద్రజిత్తు మరణవార్త విని రావణుడు బాధతో మూర్ఛిల్లాడు. కాసేపటికి తేరుకుని క్రోధంతో రాత్రివేళ నిద్రించుచున్న రామలక్ష్మణులను హతమార్చాలని వెళ్ళాడు. ఆ సమయంలో రామభక్త హనుమంతుడు రామలక్ష్మణుల చుట్టూ తన వాలంతో ప్రాకారాన్ని నిర్మించి, ఆ ప్రాకారానికి ద్వారమాత్రంగా అవకాశముంచి అక్కడే హనుమంతుడు ద్వారపాలకునిగా నిలబడ్డాడు. ఆ పరిస్థితిలో హనుమంతుని జయించి రామలక్ష్మణులను వధించుట కష్టమని గ్రహించాడు.

## మాయావి మైరావణుడు

రావణుడు తనమిత్రుడు లంకాధీశ్వరుడైన మైరావణుని రామ లక్ష్మణులను బంధించుమని పురిగొల్పాడు. అప్పుడు మాయావి మైరావణుడు విభీషణుని రూపము దాల్చి హనుమంతుని మోసగించి, ప్రాకారము దాటి లోనికి వెళ్ళి రామలక్ష్మణులను మాయామోహితులను చేసి పాతాళలోకమునకు గొనిపోయి బంధించాడు. విభీషణుని వలన ఈ రహస్యము తెలుసుకుని మారుతి సూక్ష్మరూపము దాల్చి పాతాళలోకములో ప్రవేశించాడు.

## బ్రహ్మచారి హనుమంతునకు పుత్రుడు జన్మించిన రహస్యము

సీతను అపహరించిన రావణుని సంహరించుటకు శ్రీరాముడు వానరుల సహాయముతో సముద్రముపై సేతువు నిర్మిస్తున్నాడు. అప్పుడు ఆ మహావీర్యవంతుడు హనుమంతుడు కూడా పెద్ద పెద్ద పర్వతాలను కూడ తీసుకు వచ్చి సముద్రంలో పడవేస్తున్నాడు. ఆ సమయంలో మారుతి చెమట బిందువులు సముద్రంలో పడ్డాయి. ఆ సముద్ర ప్రదేశములో మతంగ మహాముని శాపము వలన మత్స్యకన్యగా మారిన గంధర్వకన్య ఆ చెమట బిందువులను మ్రింగింది. అందువలన గర్భం దాల్చింది. ఒక శుభముహూర్తాన దీర్ఘదేహి అనే ఆ మత్స్యాంగన హనుమంతునితో సమాన బలపరాక్రమములు గలిగిన మత్స్యవల్లభుడు అనే పేరుగల కుమారుని గన్నది.

సూక్ష్మరూపధారియై మైరావణుని నగరంలో ప్రవేశించుచున్న పవన కుమారుని మత్స్యవల్లభుడాపివేసి తాను మహాబలపరాక్రమశాలియగు హనుమంతుని పుత్రుడనని తనని జయించి లోనికేగమని గర్జించాడు. అది

విని మారుతి ఆశ్చర్యచకితుడై వివరములడిగి తెలుసుకొని తానే హనుమంతుడనని చెప్పాడు. అయినా సేనాధర్మమునసుసరించి లోనికేగుటకు వీలులేదని తండ్రితో భీకరంగా పోరుసల్పాడు. చివరకు ఆంజనేయుడు మత్స్యవల్లభుని తన వాలంతో బంధించి వాని వలన రామలక్ష్మణుల వృత్తాంతము తెలిసికున్నాడు.

మైరావణుడు బంధించిన రామలక్ష్మణులను అలంకరింపజేసి పాతాళంలోని దేవి ఆలయంలో దేవికి బలియిచ్చుటకు సన్నాహాలు చేస్తున్నాడు. బందీలైయున్న ఆ సోదరులు సంజీవ పర్వతము తెచ్చి లక్ష్మణుని బ్రతికించిన ఆంజనేయుని స్మరిస్తున్నారు.

ఇంతలో నా పాతాళ లంకాపురం దద్దరిల్లునట్లు ఆ మహావీరుడు వాయు నందనుడు గర్జించి రామలక్ష్మణులను భుజములపై నిడుకుని రాక్షసులను తన వాలంతో బంధించి వధించాడు. అప్పుడు మైరావణుడు కోపించి హనుమంతుని ఎదుర్కొన్నాడు. రుద్రావతారుడైన హనుమంతుడు విజృంభించి మైరావణుని హతమార్చాడు.

శ్రీరాముని ఆజ్ఞతో హనుమంతుడు తన పుత్రుడు మత్స్యవల్లభుని పాతాళరాజుగా పట్టాభిషిక్తుని చేసి రామలక్ష్మణులను తన భుజములపై నిడుకుని విజయోత్సాహముతో లంక చేరాడు. విచారమగ్నమైన వానర సైన్యము రామ, లక్ష్మణులను జూచి ఉత్సాహంతో సింహనాదాలు చేశారు. ఆ జయధ్వనులు విన్న రావణుడు కృంగిపోయాడు.

## రావణ సంహారం

రావణుని శోకం క్రోధంగా మారింది. రథంమీద గ్రీష్మభానునిలా ప్రకాశిస్తూ రణరంగంలో ప్రవేశించాడు. ఆ మహాబల పరాక్రమవంతులు రామ, లక్ష్మణులు ఇద్దరు భీకరంగా యుద్ధం చేస్తున్నారు. ఆ భయంకర పోరాటమునకు భూమి కంపించినది. రామరావణ యుద్ధం ఏడు రోజులు ఘోరంగా సాగింది. చివరకు శ్రీరాముడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ బాణము రావణుని ప్రాణాలు హరించింది. వానరులందరూ విజయోత్సాహంతో గంతులు వేసారు. రావణ సంహారంలో అంజనేయుడొనర్చిన వీర పౌరుష సాహస కృత్యములు ఎంతో గణనీయమైనవి.

## మంగళవారము హనుమ సీతా సందర్శనము

ఆంజనేయా, ఇప్పుడు లంకలో ప్రవేశించి సీతాదేవికి రావణవధ వార్తను వినుపింపుమని శ్రీరాముడాజ్ఞాపించాడు. హనుమంతుడా వార్తను మహదానందంతో జానకీదేవికెరుకపరిచాడు. ఆ సీతామాత అంజనేయుని నోటివెంట ఆ సంతోషవార్తను విని ఎంతో ఆనందించి వీరాధివీరా, హనుమా! సమస్త సద్గుణములు నీయందు నివాసమొనర్చుగాక. సౌమిత్రిసహితుడై కోసలాధిపతి నీయందెల్లప్పుడూ ప్రేమతో నుండుగాక అని ఆశీర్వదించింది. ఆనాడు మంగళ వారమగుటచే తానానాడు విజయ సందేశమును వినియుండుటచే ఆ వారమును జయవారమని పేరుంచి, ఆ సందేశమును తనకు వినిపించిన ఆంజనేయుని ఆ వారము పూజించి, సింధూర తిలకం ధరించి, తీర్థప్రసాదములు స్వీకరించిన వారికి సర్వకార్యాలు సిద్ధించునని సీతామాత వరమొసంగినది.

## తన హృదయంలో సీతారాములను చూపిన లీల

శ్రీరామ పట్టాభిషేక సమయంలో శ్రీరామచంద్ర ప్రభువులవారు స్వయంగా సుగ్రీవాంగద, నీలగవయ, విభీషణాదులకు బహుమతులిచ్చి ఘనంగా సత్కరించాడు. అప్పుడొక దివ్యమైన, అతివిలువైన మణిహారాన్ని సీతాదేవికిచ్చి నీకిష్టమైనవారికి బహుకరించుకోమన్నాడు.

ఆ సభలోని ప్రతి ఒక్కరు ఆ దివ్యహారాన్ని సీతామాత ఎవ్వరికిస్తుందో యని ఆదుర్దాగా చూస్తున్నారు. హనుమ మాత్రం హారం విషయాన్ని పట్టించు కోకుండా రామనామజపం చేసుకుంటున్నాడు. ఆ హారాన్ని సీతామాత మారుతి మెడలో అలంకరించింది. అమ్మ ఎన్నికకు అందరు అభినందించారు.

ఆ రామభక్త హనుమంతుడు ఆ హారంలోని మణులను ఒక్కొక్కటి బ్రద్దలుకొట్టి పరిశీలిస్తున్నాడు. అది చూచి విభీషణుడు ఆశ్చర్యంతో హనుమా! నీ జాతి లక్షణం పోనిచ్చుకున్నావు కాదు గదా! మణి విలువ నీకేమి తెలుస్తుందని ఎత్తిపొడిచాడు. అవును. సురాపాన మత్తులకు రాళ్ళుకూడా విలువైనవిగానే కనిపిస్తాయి అన్నాడు హనుమ. నిజమే నేను రాక్షసుడను. నీవు సురాపానం చెయ్యకుండానే మత్తెక్కి విలువైన మణులను బద్దలుగొట్టుతున్నావని మందలించాడు.

అవును నేను రామనామామృతపానంతో మత్తెక్కి ఉన్నాను. అమ్మ దివ్యమైన కంఠహారం నాకిచ్చింది. ఈ అపురూప మణులలో రామ ప్రభువు కోసం బ్రద్దలు కొట్టి చూస్తున్నానన్నాడు. అయితే నీ దేహంలో శ్రీరాముని రూపం చూపించగలవా యని సవాలు చేశాడు విభీషణుడు.

ఆ రామభక్త హనుమంతుడు విభీషణుని పలుకులు విని నా హృదయంలో రామ ప్రభువు కనిపించకపోతే దేహాన్ని చాలిస్తానని హనుమ తన గోళ్ళతో గుండె చీల్చాడు. హనుమ హృదయంలో సీతారాముల రూపాలు కనిపించాయి. అతని రోమముల నుండి రామనామం వినిపించింది. విభీషణాదులు ఎంతో ఆశ్చర్య పడ్డాడు. శ్రీరామచంద్రుడు హనుమ నాదరంతో కౌగిలించుకున్నాడు.

## చిరంజీవిగా నుండుటకు శ్రీరాముని నుండి వరం పొందిన వాయుసుతుడు

ఆ శ్రీమన్నారాయణుడు శ్రీరాముడుగా అవతరించిన రాక్షస సంహారాది కార్యాలు నెరవేరాయి. బ్రహ్మాది దేవతలందరూ ఆ వైకుంఠవాసుని తిరిగి వైకుంఠానికి విచ్చేయమని ప్రార్థించారు. శ్రీరామ ప్రభువు హనుమంతుని చేరబిలిచి హనుమంతా! సీతా విరహంతో అరణ్యంలో తిరిగేటప్పుడు ధైర్యం చెప్పి సుగ్రీవునితో స్నేహం కలిగించావు. సీతజాడ తెలిపి నన్ను ఎంతో ఆనందింప చేశావు. యుద్ధరంగంలో నా విజయానికి ఎంతో తోడ్పడ్డావు. లక్ష్మణునకు ప్రాణదానం చేశావు. అవి నా హృదయంలో మెరుస్తున్నాయి.

"హనుమా! నేనవతారం చాలిస్తున్నాను. ఈ లోకంలో నా కథ వున్నంత వరకు నీ జీవితం, నీ కీర్తి స్థిరంగా ఉంటాయి. నా కథాగానం, నా నామ సంకీర్తనం జరిగేచోట నీవు సిద్ధంగానుండి నా సన్నిధిలోనున్నట్టి తృప్తిపొందు. భక్తి రక్షణ నీ కర్తవ్యం. యుగయుగాలలో నేనవతరించినప్పుడు నీకు దర్శనమిస్తూ వుంటాను. నీవు తలుచుకొన్నప్పుడు నేను సాక్షాత్కరిస్తాను. నీవు ఈ లోకంలో చిరంజీవిగా వుండు' అని వరమిస్తాడు.

## చిరంజీవి హనుమంతుని నివాసము

శ్రీరామ ప్రభువు హనుమంతుని స్థిరనివాసమునకు మేరుపర్వతమునకు నైరుతివాలుగానున్న గంధమాదన పర్వతముపై హనుమత్పురమె యిచ్చాడు.

ఆ పర్వత రాజముపై సువర్చలకు తాతగారైన విశ్వకర్మ హనుమ నివాసం కోసం విశాలమైన సువర్ణశాలలను నిర్మించాడు. ఆ పర్వత రాజం నానాజాతి ఫల వృక్షాలతోను, వివిధ పుష్పరాసులతోను, నారికేళ, కదళి, పనస, ఖర్జురాది వృక్షాలతోను, వివిధరకాల పక్షుల కలకలారావాలతోను, మునుల పర్ణశాలలు, గంధర్వ క్రీడా గృహాలతోను చూడముచ్చటగా కనులపండుగగా వుంటుంది. ఆ పర్వత శ్రేష్టం మీద సువర్చలాసమేతలైన ఆంజనేయస్వామివారు నివశిస్తూ అందలి కదళీ వనాలయందు విహరిస్తూ, క్రీడిస్తూ భక్తిరక్షణ చేస్తుంటాడు.

## భవిష్యద్బ్రహ్మ

ఆ భక్తశ్రేష్ఠుడు హనుమంతుడు రామదర్శనానికి వచ్చి, ప్రదక్షిణ నమస్కారములొనర్చి వినయంగా నిలబడ్డాడు. శ్రీరామ ప్రభువు వినమ్రుడైవున్న హనుమంతునితో 'హనుమా' నా వేలికి భూషణమైన బంగారు ముద్రికను బ్రహ్మకోర్కెపై సత్యలోకానికి పంపించాను. ఇప్పుడు జానకి ఆ ఉంగరాన్ని చూడగోరు చున్నది. కనుక నీవు బ్రహ్మసన్నిధిలోనున్న యాముద్రికను శీఘ్రముగా వెళ్ళి తీసుకునిరా అన్నాడు. ఆ ఆదేశం అందుకొని హనుమంతుడు వాయువేగ మనోవేగాలతో బ్రహ్మలోకానికి వెళ్ళాడు. బ్రహ్మదేవుని స్వాగత సత్కారాలందు కొన్నాడు. శ్రీరామాజ్ఞగా రాజముద్రికను యివ్వమని బ్రహ్మను వినయంగా అడిగాడు.

ఆ ముద్రికనీయనని బ్రహ్మపై కోపించి మండుచున్న యగ్నిహోత్ర కాంతిగలిగి వెలుగుచు మేరు మందర పర్వతములతో సమానమైన గొప్ప యాకారముగలవాడై ఎర్రని ముఖము, వజ్రాయుధముల వంటి గోళ్ళు, కోరలుగలిగి భయంకరుడుగానున్న ఆ విశ్వరూపాన్ని ప్రదర్శించిన హనుమంతుడు బిగ్గరగా సింహనాదం చేశాడు. ఆ భయంకర విశ్వరూపాన్ని జూచి బ్రహ్మ లోకవాసు లందరు భయకంపితులవగా బ్రహ్మ ముద్రికను ఇచ్చాడు. ఆ ముద్రికను సీతారాములకర్పించి వారిని మిక్కిలి సంతోషపరిచి తనకు సత్యలోకం ఎంతో ఆనందం కల్గించినట్లు చెప్పాడు.

అంత శ్రీరామ ప్రభువు అనుగ్రహముతో 'హనుమా! నీవు బ్రహ్మలోకాన్ని చూచి ఎంతో ఆనందించావు. కనుక నీవు బ్రహ్మలోకాధిపత్యము పొందుదువు

గాక! భవిష్యద్బ్రహ్మవై నీవానాడు చరాచర సృష్టి గావిస్తూ నా ఆజ్ఞను పాలిస్తూ సమస్తలోకాలను పాలిస్తూ భక్తులను రక్షిస్తూ కీర్తిగడించు' అని వరం ప్రసాదించాడు.

## మహామహిమాన్వితమైన హనుమంతుని వాలము

పరమేశ్వరుడు భయంకర రాక్షసుడైన త్రిపురాసురుని సంహరించుటకు దేవతలందరు ఆ దేవునకు సహకరించారు. శ్రీ మహావిష్ణువు బాణరూపం ధరించి శివుని ధనస్సు పినాక నుండి బయలుదేరి త్రిపురాసురుని సంహరించాడు. ఆ సమయంలో తనకు విశేషంగా సహకరించిన శ్రీమన్నారాయణుడు రాక్షస సంహారము కోసము శ్రీరామచంద్రునిగా అవతరించాడని ఆ పరమశివుడు శ్రీరామ సహాయార్థము ఆంజనేయుడుగా అవతరించ సంసిద్ధుడుకాగా పార్వతమ్మ కూడా వాలము రూపంలో హనుమంతుని అనుసరించింది. శ్రీరామ సహాయార్థము ఆదిశేషుడు లక్ష్మణునిగా, శంఖ, చక్రములు భరత, శత్రుఘ్నులుగా అవతరించినట్లు పార్వతి హనుమంతుని వాలం రూపం ధరించినది.

ఆ మహాబల సంపన్నుడు మారుతి వాలము శక్తిస్వరూపంగాన ఎంతో మహిమాన్వితమైనది. హనుమంతుని తోక అంటే అది యేదో మామూలు కోతుల తోక వంటిదిగాక, విశేషమైన వస్తువుగా ఏకనాధస్వామి తమ భావార్థ రామాయణంలో చెప్పాడు. ఆంజనేయుడు తన తోకకు ఆజ్ఞలు, ఆదేశాలు యిస్తాడని, దానితో సంప్రదింపులు చేస్తాడని, అయనకు అది గుప్త సాధనంగా ఉందని చెప్పాడు.

సమర్థ రామదాసుగారు ఆంజనేయుని తోకను గురించి విలక్షణ రీతిలో వర్ణించాడు. హనుమంతుడు తన తోకను ఎంత కావాలంటే అంత పెంచ గలుగుతాడు. ఎక్కడికి పంపాలంటే అక్కడకు పంపగలుగుతాడు.

దేహే ఆపులే సర్వహీ గుప్తకాలే ।
ప్రసంగీతయే పుచ్ఛతే బాధావాలే ॥
దేహే ఆపులే సర్వహీ గుప్తకాలే ।
ప్రసంగీతయే పుచ్ఛత్ బాధావీలే ॥

హనుమంతుడు లంకనంతా తన తోకను త్రిప్పాడు. అనేక రాక్షసుల ఇండ్లలో ప్రవేశింపజేసి పెద్ద అలజడి కలిగించాడు. రాత్రిళ్ళు నిద్రిస్తున్న రాక్షసుల వద్దకు తన తోకను చేర్చి తాను గుప్తంగా ఉండి భయం కలిగించాడు. వారు

అదిరిపడి పాము, పామని దీపం తెచ్చి చూసేసరికి అక్కడ ఏమీ ఉండదు. గుఱ్ఱం మీద, ఏనుగుల మీద వెళుతూ ఉంటే, వాటి పాదాల వద్ద తోకను అల్లలాడించాడు. వారు అదిరిపడి చూచేసరికి అక్కడ ఏమీ ఉండదు. స్త్రీలు నీళ్ళ కడవలు భుజాన పెట్టుకొని వస్తుండగా, ఆంజనేయుని తోక వారి కాళ్ళ క్రింద మెదులుతుంది. వారు కంగారు పడతారు. భుజమ్మీద కడవలు క్రింద పడిపోతాయి. ఇది లంకా వాసులకు పెద్ద అపశకునంగా అయింది.

రావణ దర్బారులో రావణుడు ఉన్నతాసనం మీద కూర్చొని ఉండగా, ఆంజనేయుడు, తన వాలంతో ఎత్తైన ఆసనము నేర్పరచుకొని రామ, పరాక్రమము వర్ణించాడు. యుద్ధరంగంలో శక్తివంతమగు తన వాలంతో అతి బలపరాక్రమ వంతులైన రాక్షస నాయకులను, సైన్యాన్ని బంధించి హతమార్చాడు.

## లంకాదహనం

రావణుడు హనుమంతుని మీద కోపంతో "వానరులకు తోక ప్రీతికరమైన చిహ్నం". ఆ తోకను కాల్చివేయండి అని రాక్షసులను ఆజ్ఞాపించాడు. ఆ రాక్షసాధములు ఆంజనేయుని తోకకు గుడ్డలు చుట్టబెట్ట నారంభించారు. హనుమ తోకను పెంచసాగాడు. పెంచినకొలది రాక్షసులు నూనెగుడ్డలు చుట్టు చున్నారు. చుట్టినకొలది తోక పెరుగుతోంది. ఆ కపిశార్దూల మొకింతసేపు క్రీడలు సల్పుటచే లంకానగరమునందున్న వస్త్రములు, నూనె, నేయి లోపించినవి. ఒక రాక్షసుడు ఆ తోకకు నిప్పంటించాడు. అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లగా రాక్షసులాడుచూ, పాడుచూ సంతోషించారు. రుద్రాంశసంభూతుడగు ఆంజనేయుడా ఆ మంటలతోనున్న తోకను త్రిప్పుచు దానితో రాక్షసులను తీవ్రముగా కొట్టనారంభించాడు. వజ్రాఘాతములవంటి ఆ దెబ్బలకు అచ్చట నున్న వారందరు భయపడి పారిపోయిరి. కాని వారెచ్చటకు వెళ్ళినను కాలసర్పం వంటి ఆ తోక దెబ్బలు వచ్చి తగులుటచే హతులయ్యారు. ఆ కపి శ్రేష్ఠుడు ఆ శ్రీరామచంద్రునకు జయమగుగాకయని నినాదం చేస్తూ ఒక ఇంటిమీద నుంచి, మరియొక భవనముపైకి దూకుచు, ఎగురుచు, జాతి స్వభావ చేష్టలు చేయుచు ఆ యిండ్లకు నిప్పంటించాడు. యిండ్లు, భవనములు, ప్రాకారములు మొదలగునవన్నియు ఒకదాని నుండి ఇంకొక దానికి మంటలు అంటుకొని లంకా పట్టణమంతా దగ్ధమై పోయింది. అందలి రథ, గజ, తురగములు, మృగ, పశు, పక్షి, వృక్ష సహితంగా రాక్షసులు ఎందరెందరో మడిసిరి.

# సహస్ర కంఠ రావణ వధ

సహస్ర కంఠ రావణుడు సప్త సముద్రాలకావలనున్న దీవిలో ఉన్నాడు. వానికి వేయి తలలు, రెండువేల బాహువులున్నవి. అతడా ద్వీపం దాటి వచ్చి మిగిలిన ద్వీపాలలో నుండేవారిని బాధించేవాడు. వానిని వధించటం ఎవ్వరికీ సాధ్యంకాలేదు. ఆ రాక్షసుని సంహరించడానికి శ్రీరాముడు ఆంజనేయుని నియోగించాడు. ఆ మహాబల పరాక్రమవంతుడు వాయునందనుడు విశ్వ రూపాన్ని ప్రదర్శించాడు. బ్రహ్మాది దేవతలు, నక్షత్ర గ్రహ తారాదులు, ఋషులు వాని దేహంపైనను, సమస్త చరాచర జంతు, వస్తు సంతతులు వాని రోమకూ పాదుల యందును ప్రకటితమైనవి. అట్లా ఆ మహాబల సంపన్నుడు అనేక శిరస్సులతోను, బాహువులతోను విలసిల్లుతూ దిక్కులన్నిటియందును వ్యాపించి, ఆ రూపంలో రామచంద్రా! నా తోకను సప్త సముద్రాలు దాటు వరకు సహస్ర కంఠాసురుని నివాసం వరకు పెంచుతాను. నా తోక మీదుగా మీరు సముద్రాలను దాటి వెళ్ళి ఆ దుష్టుని మీరే వధించి రండు. ఆ కీర్తి మీకే దక్కాలి అని చెప్పి తోకను పెంచాడు. సప్త సముద్రములకు వారధివలెనున్న హనుమంతుని వాలమందు నక్షత్రములు, గ్రహములు దర్భకొనలపై మంచు బిందువులవలె ప్రకాశించినది. ఆంజనేయుడు చెప్పిన ప్రకారము ఆ వాల వారధిని వెళ్ళి ఆ సహస్ర కంఠాసురుని వధించాడు శ్రీరామచంద్రుడు.

ఇంత అద్భుత దివ్యశక్తి స్వరూపంగాన ఆ మహా మహిమాన్వితమైన ఆంజనేయ వాలమును పూజిస్తారు. ఆ దివ్యశక్తిగల వాలాన్ని పూజిస్తే సాక్షాత్తు ఆదిశక్తిని పూజించినట్లే.

# విశ్వరూపము

శ్లో॥ చరాచర మిదం విశ్వం। సర్వం హనుమదాత్మకం।
ఏవం విభావయన్తియేతేతరం తివ సంశయః (పరాశర సంహిత)

ఈ చరాచర జగత్తంతా హనుమదాత్మకమైనది. అట్లు తెలిసినవారు నిస్సంశయంగా తరిస్తారని పరాశర సంహితలో చెప్పబడింది. ఉదయాద్రి మీద ఒక పాదాన్ని, అస్తాద్రి మీద ఒక పాదాన్ని ఉంచి సూర్యుని వద్ద వేదవేదాంగములు

నేర్చినది హనుమ యొక్క మధ్యమగు రూపము. శతకంఠ రావణుని సంహారంలో ధరించినది కూడా మధ్యమగు రూపమే.

భీమునకు చూపించినది 10 యోజనాలు విస్తీర్ణం, 30 యోజనాల వైశాల్యం కల రూపము. ఈ రూపంతోనే హనుమ సముద్ర లంఘనం చేసాడు. సీతమ్మ వారికి చూపించినది మండుచున్న యగ్నిహోత్ర కాంతి కలిగి , వెలుగుచూ మేరుమందర పర్వతములంత యాకారము గలిగి, యెఱ్ఱని ముఖము, వజ్రాయుధము వంటి గోళ్ళు, కోఱలు గల విశ్వరూపము.

సహస్ర కంఠ రావణ సంహార కాలంలో హనుమ ధరించిన విశ్వరూపము. హనుమ తన తోకను పెంచగ అది సప్తసముద్రాన్ని దాటింది. శ్రీరాముడు ఆ తోక మీద నుండి దాటి వెళ్ళాడు. ఆ తోక మీద నక్షత్రములు, గ్రహాలు మొదలైనవి దర్భకొనల మీద మంచు బిందువుల వలె కన్పించాయి. హనుమ వేయి శిరస్సులతో, వేయి బాహువులతో తన విశ్వరూపాన్ని చూపించాడు.

## పంచముఖ హనుమద్రూపము

ఆ మహాతేజోవంతుడు శ్రీరామచంద్రుడు రావణ వధానంతరము సీతా సమేతంగా అయోధ్యకేగు సన్నాహములో నిమగ్నులైయున్నారు.

ఇంతలో వినువీధి నుండి "రామా! దశకంఠాసురుని వధించుట గొప్ప కాదు. శతకంఠాసురుని వధిస్తే నీకు సంపూర్ణ విజయం లభిస్తుంది" అని వినిపించింది. అది విని శ్రీరామచంద్రుడు దశకంఠాసురుని వధించుటకే ఇంత శ్రమ పడవలసివచ్చెను గదా! శతకంఠాసురుని వధించుటకు ఎంత శ్రమ పడవలయునోయని మనస్సులో దలపోసెను.

అప్పుడు ఆ మహా బలపరాక్రమవంతుడు హనుమంతుడు శ్రీరామ చంద్రుని మనస్సు గ్రహించి ప్రభూ మీరనుమతిస్తే శతకంఠాసురుని నేను వధిస్తానని చెప్పి రామాజ్ఞగైకొని సీతామాతతో సహా శతకంఠాసురునిపై యుద్ధానికి బయలుదేరాడు.

ఆ కపి శార్దూలము మారుతి సముద్రముపై శతయోజనముల దూరము తన వాలము పెంచి, సైన్యమును సృష్టించి, సముద్రము దాటి శతకంఠాసురునిపై యుద్ధానికి తలపడ్డాడు. ఆ భీకర పోరాటములో హనుమ విజృంభించి

శతకంఠాసురుని శిరస్సులు ఎన్ని పర్యాయములు ఖండించినను అవి మరల వెంటనే ఉద్భవించుచుండెను.

అప్పుడు ఆ మహాజ్ఞాని హనుమ ఆ మాయావి మరణ రహస్యం గ్రహించి తదనుగుణంగా 1. వానర 2. నారసింహ 3. గరుడ 4. వరాహ, 5. అశ్వరూపములు ధరించి పోరు సల్పుచూ రాక్షసుని శిరస్సులు ఖండించగా అతని రక్త బిందువులు భూమి మీద పడగానే వేలాదిమంది రాక్షసులు ఉద్భవించుచున్నారు. అప్పుడు ఆంజనేయుడు సీతామాతను ప్రార్థించగా అమె కాళికారూపం ధరించి నాలుక భూమిపై చాచి రాక్షసుని రక్తము నేలపై పడకుండా పీల్చసాగెను. అప్పుడు వాయునందనుడు తన వాలంతో రాక్షసుని బంధించి వధించాడు.

శతకంఠాసురుని వధించుటకు శ్రీ ఆంజనేయ స్వామి ధరించిన రూపము. అందువలన స్వామి వారు పంచముఖాంజనేయస్వామిగా ప్రసిద్ధి చెందారు. పంచముఖాంజనేయులుగా స్వామిని కొల్చి భక్తులు తరిస్తున్నారు.

## హనుమన్నవావతారాలు

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం - వినాశాయచ దుష్కృతాం ।
ధర్మ సంస్థాప నార్థాయ - సంభవామి యుగే యుగే ॥

ఏ దైవమైనా ముఖ్యంగా రెండు ప్రయోజనాల కోసం అవతారాలెత్తడం జరుగుతుంది. (భగవద్గీత).

అలాగే శ్రీ ఆంజనేయుడు కూడా దుష్టశిక్షణ, శిష్టరక్షణ అనే రెండు ముఖ్య ప్రయోజనాల కోసం తొమ్మిది అవతారాలెత్తాడు.

1. శ్రీ ప్రసన్నాంజనేయ స్వామి
2. శ్రీ వీరాంజనేయ స్వామి
3. శ్రీ వింశతి భుజాంజనేయ స్వామి
4. శ్రీ పంచముఖాంజనేయ స్వామి
5. శ్రీ అష్టాదశ భుజాంజనేయ స్వామి
6. శ్రీ సువర్చలాంజనేయ స్వామి

7. శ్రీ చతుర్భుజాంజనేయ స్వామి
8. శ్రీ ద్వాత్రింశద్భుజాంజనేయ స్వామి
9. శ్రీ వానరాకారాంజనేయ స్వామి

(పరాశరసంహిత)

## హనుమ పాముకోళ్ళ ధారణ మర్మము

మంచి రూపవంతులు, నవయౌవ్వన యువతులు రంగు, రంగుల పుష్పాలంకారములతో, సర్వాభరణములతో, సెంటు గుబాళింపులతో శోభాయ మానంగా అలంకృతులైనప్పుడు చూసిన పురుషులకు చూపు, స్పర్శ, అనుభూతులతో మనస్సు కామంతో చలించి వికారం చెందవచ్చు. ఆ సమయంలో స్ఖలన దోషం జరగవచ్చు.

భీష్ముడు కాశీరాజు కుమార్తెల స్వయంవరంనాడు సమస్త రాజులను ఓడించి రూపవంతులైన రాజపుత్రికలను తన సోదరులకు వివాహము చేయుటకు రథము మీద తన ప్రక్కన కూర్చొపెట్టుకు తీసుకుని వస్తుండగా ఆయన మనస్సు కొంచెము చలించినట్లు ద్రౌపదితో చెప్పాడు. అంతటి మహానుభావునకే ఇంద్రియ నిగ్రహలోపం జరిగింది.

ఈ దోషనివారణకు మన ప్రాచీన మహర్షులు శాస్త్రీయంగా శరీరమును శోధించి కాళ్ళబొటన వేలు, రెండవ వేలు మధ్య కామనాడులు ఎక్కువ ఉద్రేకముగా నున్నట్లు కనుగొన్నారు. అచ్చట వత్తిడి కలిగిన కామోద్రేకము తగ్గుతుంది. స్ఖలన దోషం జరగదు. పాముకోళ్ళు ఆ రెండువేళ్ళ మధ్య భాగమును వత్తిడి గలిగించును. కామోద్రేకము తగ్గుతుంది. అందువలననే బ్రహ్మచారులకు ఎల్లప్పుడునూ, పెండ్లి కుమారునకు వివాహకాలంలోను పాముకోళ్ళధారణ ఏర్పాటు చేశారు. ఆ మహాజ్ఞాని బ్రహ్మచారి హనుమంతుడు పాముకోళ్ళధారణ మర్మము ఇదియే. ఇది మన మహర్షుల మేధాశక్తికి గీటురాయి.

## సింధూరం ప్రాశస్త్యము

ఈశ్వరునకు భస్మంవలె, జగన్మాతకు కుంకుమవలె శ్రీ ఆంజనేయ స్వామి వారికి సింధూరమెంతో ప్రీతికరమైనది. సింధూరంతో వారిని పూజించినా,

విగ్రహానికి పూసినా త్వరలో ప్రసన్నులౌతారు. భక్తుల కోరికలు నెరవేరుతాయి. దిగ్విజయం కలుగుతుంది. సమస్త బాధలు తొలగుతాయి. స్వామివారికి సింధూరం ప్రీతికరం కావటానికి కారణము కొన్ని పురాణ గాధలు ఉన్నవి.

. శ్రీరామ పట్టాభిషేకమప్పుడు సీతారాములు హనుమంతునకు బ్రహ్మ విద్యనుపదేశించారు. అందుకు ముందుగా పవిత్రతకై సీతామాత ఆంజనేయుని మీద సింధూరం చల్లింది.

అదీకాక శ్రీరాములువారు సుగ్రీవాంగదాది వానరులకు, బహుమతు లొసగి ఆంజనేయునకు అతి విలువైన ముత్యాలహారమిచ్చారు. ఆ ముత్యాలలో రామస్వరూపంగాని, రామ నామముగాని లేవని ఆ హారం తనకు వద్దని హనుమ నిరాకరిస్తాడు.

అప్పుడు సీతామాత తన పాపిటలోని సింధూరాన్ని తీసి మారుతికి బహుకరించి, హనుమా! ఇది నాకు ముఖ్యమైన సౌభాగ్య చిహ్నం. నేను దీనివల్లనే సర్వసౌఖ్యాలు, ఆనందాలు అనుభవిస్తున్నాను. ఈ ముత్యాలు, రత్నాలు, సువర్ణా భరణాలు కంటే ఈ సింధూరాన్నే నేను ఎక్కువగా ప్రేమిస్తాను అని కూడా చెప్పింది. ఆ మాతృమూర్తి వ్యాఖ్యలు విశ్వసించి భక్తితో స్వీకరించాడు సింధూరాన్ని మారుతి.

ఒకనాడు అయోధ్యలో ఆంజనేయస్వామి రామసేవ చేస్తూ రాత్రి పొద్దుపోయేవరకు శ్రీరామ ప్రభువారి శయనాగారంలో ఉన్నాడు. సీతామాత వచ్చి రాత్రి శయనాగారంలో ఎవ్వరూ వుండకూడదని హనుమను వెళ్ళమన్నది. అయితే మీరెందుకు వుంటున్నారు? అని మారుతి ప్రశ్నిస్తే ఆమె పాపిట నుండి సింధూరం తీసి దానివల్లనే శ్రీరాముని సన్నిధిని వుండటానికి అధికారం కలిగివున్నది అంది.

అది విని హనుమ మరునాడు ఉదయం గంగ సింధూరాన్ని నూనెలో కలిపి శరీరం అంతా లేపనం చేసుకొని రాజదర్బారుకు వచ్చాడు. సభాసేను లందరు విచిత్రంగా చూచారు. ఇదేమిటని రామచంద్రుడడిగితే పాపిటలోని కొంచెం సింధూరం వుండటంచేతనే మీ దగ్గర ఎల్లప్పుడూ వుండటానికి అధికారం అమ్మకు కలిగింది. ఎల్లప్పుడూ మీ సాన్నిధ్యంలో వుండటానికి సింధూరం ఇట్లా శరీరమంతా రాసుకున్నానన్నాడు.

ఆ మాటకు శ్రీరామచంద్ర ప్రభువులవారు ఎంతో ఆనందించి 'హనుమా! ఈ రోజు మంగళవారమగుటచే నిన్ను ఏ భక్తులు మంగళవారము సింధూరంతో పూజిస్తారో, వారి కోరికలు నెరవేరును. వారికి భోగభాగ్యములు కలుగుతాయి అని దీవించాడు. ఆనాటి నుండి అంజనా నందనుని మంగళవారము నాడు సింధూరంతో పూజించే ఆచారం వచ్చిందని నానుడి.

## అర్జునుని గర్వభంగము

ఆంజనేయార్జునులు కల్సుకొనుట తటస్థపడినది. నా కృష్ణుడు గొప్పవాడని, నా రాముడు గొప్పవాడని పరస్పర వాదోపవాదాలు చెలరేగినవి. రాములవారు గొప్పవాడైతే సముద్రముపై శరసేతువు నెందుకు నిర్మించలేక పోయాడన్నాడర్జునుడు. దానికాంజనేయులు పార్థా! శరసేతువు విశేషభారాన్ని భరించలేదు. నేను కాలుమోపితేనే భగ్నమైపోతుంది. అనంతమైన సైన్యం దాటాలి కదా! అందుకే రాములవారు శరసేతువు నిర్మించలేదని చెప్పాడు రాముని శక్తిని సమర్థిస్తూ.

వానర భారాన్ని భరించగలిగేటంతటి శరసేతువును నిర్మించలేనివాడన్న మాట రాముడు అని అర్జునుడు పరిహాసంగా మాట్లాడి, అంతటితో పోనివ్వక నువ్వు కాలు మోపితేనే శరసేతువు భగ్నమైపోతుందన్నావు. నేను శరసేతువు నిర్మిస్తాను. నీ వెళ్ళి భగ్నం చేయి చూస్తాను అని ప్రగల్భాలు పల్కాడర్జునుడు. ఆంజనేయుడు భగ్నపరుస్తాను నిర్మించమన్నాడు.

కృష్ణుని స్మరించి వెంటనే శరసేతువును నిర్మించాడర్జునుడు. అది భగ్నం కాకుండా కృష్ణుడు కూర్మావతారం (తాబేలు) ధరించి ఆ శరసేతువు క్రింద అనువుగా వున్నాడు. ఆంజనేయస్వామి ఉగ్రరూపంతో పాదాంగుష్ఠంతో దాన్ని నొక్కాడు కాని విరుగలేదు. కదలలేదు. శక్తినంతా ఉపయోగించి చూసాడు. లాభం లేకపోయింది.

సీతారాములను స్మరించాడు. కారణమర్థమైంది. క్రింద చూడగా తాబేలు రక్తం క్రక్కుతోంది. ఆ రక్తంలో శ్రీరామచంద్రులవారి దర్శనమైంది. భక్తితో వెంటనే సేతువు దిగి ఆ రక్తమంతా తన శరీరం నిండా పూసుకొన్నాడు. అందుకే ఆంజనేయ స్వామి ఆ రక్తం రంగు కల్గిన గంగ సింధూరమంటే ప్రీతి. దానితో పూజించినా, దానిని విగ్రహమునకు పూసిన ఆనందించి ప్రసన్నుడౌతాడు.

## గంగ సింధూరము వైజ్ఞానిక

గంగ సింధూరము తైలముతో కలిపి లేపన చేసిన చర్మ రోగములు హరించును. నేతితో కలిపి లేపనము చేసిన గాయాలు మానును.

కొబ్బరి నూనెతో తేనె, మైనం కరిగించి అందు గంగసింధూరము జేర్చి చల్లారిన పిదప వ్రాసిన కురుపులు, గజ్జి, కుష్టు, వ్రణములు మొదలగు రక్త దోష జనిత రోగములు హరించును.

## భీమ గర్వభంగము

పాండవులు కపట ద్యూతంలో ఓడిపోయి అరణ్యావాసము చేస్తున్నారు. ఒకరోజు భీముడు పాంచాలితో కూడి ప్రకృతి శోభ తిలకిస్తూ ఆనందంతో విహరిస్తున్నాడు. అప్పుడు సువర్ణఛాయగల్గిన సహస్ర పత్రకమలము యొకటి గాలికి నెగసివచ్చి వారి ముందుపడింది. దాని పరిమళం మంచి వాసనతో గుబాళించింది. అప్పుడు ద్రౌపది ఆ కమలమును చేబూని నాధా! ఈ కమలం నా హృదయాన్ని ఆకర్షించింది. ఇట్టి పుష్పాలింకా కొన్ని తెచ్చి నాకానందం చేకూర్చమని కోరింది. అతడామె కోర్కె తీర్చడానికి పుష్పం ఎగిరి వచ్చిన దారివెంట ఉత్సాహంగా బయలుదేరాడు. గంధమాదన పర్వతం వద్దకు చేరాడు. అడ్డం వచ్చిన వన్య మృగాలను సంహరిస్తూ గట్టిగా తన శంఖాన్ని పూరించాడు.

ఆ గంధమాదన పర్వతముపై స్థిరనివాసుడైయున్న అంజనేయుడు ఆ శంఖారావాన్ని విన్నాడు. శంఖారావం చేసినవాడు తన తమ్ముడు భీముడని గ్రహించాడు. తన సోదరుని బలపరాక్రమములు పరీక్షించాలని అతని పయనించు దారికడ్డముగా తన వాలమును పరిచి శిలాఫలకముపై పవళించాడు. దారి కడ్డముగానున్న వాలాన్ని, నిద్రిస్తున్న మారుతిని చూసి భీముడు కోపంతో సింహనాదం చేశాడు. ఆ ధ్వనికి హనుమ నెమ్మదిగా కండ్లు తెరచి భీముని చూచి "నాయనా! నీవెవరవు. నాకెందుకు నిద్రాభంగము చేశావన్నాడు. అప్పుడు భీమసేనుడు ఇలా దారికి అడ్డంగా నీ వాలాన్ని వేశావేం? తొలగించుమని గద్దించాడు. అప్పుడు మారుతి వినయంగా "నేను వృద్ధుడను. లేవలేను. నా తోకను ప్రక్కకు నెట్టి వెళ్ళమని చెప్పాడు. మారుతి పలుకులు విని భీముడు నిర్లక్ష్యంగా వాలాన్ని ప్రక్కకు నెట్టుటకు ప్రయత్నించాడు. వాలం కదలలేదు.

తన యావత్తు శక్తిని వినియోగించి ప్రయత్నించాడు. అయినా వాలం కొంచెం కూడా కదలలేదు. అప్పటికి భీముడు ఈ కపి సామాన్యుడు కాదని గ్రహించి, చేతులు జోడించి నమస్కరించి, అయ్యా! మీ సామర్థ్యం తెలియక నిర్లక్ష్యంగా మాట్లాడినాను. తమ పరిచయ భాగ్యం కలిగించమని వినయంగా వేడుకున్నాడు. అప్పుడు పవనసుతుడు చిరునవ్వు నవ్వి "భీమసేనా నేను హనుమంతుడను. నీ సోదరుడను" అని వాత్సల్యంగా చెప్పాడు. అప్పుడు భీముడు అమితానందముతో హనుమంతుని నిజరూపం చూపించమని కోరాడు. వెంటనే ఆ మహాతేజశ్శాలి హనుమంతుడు తన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. భూమ్యాకాశాలు ఆవరించి యున్న ఆ భయంకర రూపాన్ని చూడలేక ఉపసంహరించమని ప్రార్థించాడు. కురు, పాండవ సంగ్రామములో తమకు విజయం కలిగేటట్లు వరమీయమని వేడాడు. అప్పుడు వాయునందనుడు ప్రేమతో భీమసేనా, నీవు నన్ను తలచుకొని యుద్ధం చెయ్యి. అర్జునుని రధపతాకంపై నుండి మీకు విజయం చేకూర్చుతానని అభయమిస్తాడు.

## బొట్టు ప్రాశస్త్యము

స్త్రీ పురుషులకు సౌభాగ్యచిహ్నం. శుభకార్యానికి బొట్టు పెట్టి పిలవడం మన సత్సాంప్రదాయం. స్త్రీ యొక్క నుదుటబొట్టు తాను ఐదవతనం కల్గివుందని గుర్తించడానికి ఒక మధురమైన చిహ్నం. మన సాంప్రదాయాలలో బొట్టుపెట్టి అతిధులను సాగనంపే గొప్ప సంస్కృతి మనది.

లలాటమునకు అధిదేవత బ్రహ్మ. మన హృదయకోశంలోని జీవుడు సాకారుడగు బ్రహ్మ ఇరువురు జ్యోతి స్వరూపులే. జ్యోతి ఎరుపుగాన ఎరుపు రంగు బొట్టు పెట్టుట ఆచారము. ఎవ్వరి మతసాంప్రదాయం ప్రకారం వారు తిలకధారణ చేస్తారు. బొట్టు ధారణలో ఆధ్యాత్మిక - వైజ్ఞానిక విలువలున్నవి.

**ఆధ్యాత్మికము :**

జీవుడు జాగ్రదవస్థలో భ్రూమధ్యమందు ఆగ్నేయ చక్రంలోను, స్వప్నావస్థ యందు కంఠ స్థానంలోని విశుద్ధంలోను సుషుప్తిలో హృదయంలోని అనాహతం లోను సంచరిస్తూంటాడని సాంఖ్యం చెప్పుతోంది.

భ్రూమధ్యమందు జీవుని చిహ్నంగా బొట్టు ధరించాలి. ఈ కారణంగానే పసిపిల్లలు నిద్రిస్తున్నప్పుడు జీవుడు లలాటమునందు ఉండడు. గనుక బొట్టు పెట్టరు. భర్తృహీనుల జాగ్రదవస్థలో ఉన్నవారి ఇంద్రియములకది జాగ్రదవస్థ కాదు. అందువలన వారికి బొట్టు నిషేధించారు. అట్టివారు ఆరోగ్యప్రదమైన ఆధ్యాత్మిక విలువయున్న భస్మము (విభూతి) ధరించాలి.

భస్మము అనగా భగవంతుడు అన్నీ నశింపగా మిగులునది భస్మము. అంతా నశింపగా మిగులువాడు భగవంతుడే గదా. అదే భస్మధారణ ఉద్దేశము. ఆధ్యాత్మిక రహస్యము తెలియకపోయినా ఆచారంగా పెట్టుచున్నారు.

## వైజ్ఞానికము

మనము తిలకధారణకు వాడే వస్తువులు ఆయుర్వేద ఔషధద్రవ్యాలే.

పదకొండు ధమనుల ద్వారా శరీరమంతటను మంచి రక్తము వ్యాపించును. అందులో రెండు ధమనులు ముఖముమీదుగా తలలోనికి పోయినవి. అవి అతిసూక్ష్మనరముల ద్వారా మెడ అంతయు వ్యాపించును. దానిని చల్లపరచవలయును. వానిలోని శీతలము నశించి సమశీతోష్ణస్థితికి రావలెను. వైష్ణవులు ధరించు నాము (తిరుమణి) నాడీమండలమును చల్లపరచును. పసుపుతో చేసిన తిరుచూర్ణము లేక కుంకుమ నెమ్ము లాగివేయును.

నుదురు మన శరీరంలో ఆయువుపట్టు. మనకు విపరీతంగా జ్వరము వచ్చినప్పుడు వైద్యులు నుదుటిపై తడిగుడ్డ వేస్తారు. జ్వరము తగ్గును.

అలాగే మనము ధరించే తిలకము, తిరుచూర్ణము, సింధూర కుంకుమ, విభూతి, నుదుటి పట్టీ వేసిన ఔషధ ద్రవ్యాలుగా ఆరోగ్యపదార్థాలు. చందనం మన మేధస్సును వేడినుండి రక్షిస్తుంది. పసుపు, కుంకుమ కలుపుతాము. పసుపు ఉత్సాహాన్ని కలుగజేస్తుంది. క్రిమి, రోగ సంహార పదార్థము.

కొంతమంది స్త్రీలకు కనుబొమ్మల మధ్య వెంట్రుకలు ఉంటాయి. అది అశుభసూచకంగా భావిస్తారు. ఆ రోమాలను పసుపు హరిస్తుంది.

తిలక ధారణలో లలాటము నొక్కి బొట్టు పెట్టుటలో నాడీ మండలమునకు వత్తిడి గలిగి చురుకుగా పనిచేయును. ఎదుటవారు మన ముఖములోనికి చూచినప్పుడు భ్రూమధ్యమందున్న బొట్టు శోభాయమానంగా ప్రకాశించి వారి

దృష్టి దాని మీదపడి మనకు దృష్టి దోషం నివారించును. బొటనవ్రేలు, మధ్య వేలు, ఉంగరపువేలుతో బొట్టు పెట్టుకోవాలి.

## కొబ్బరికాయ విశిష్టత

**ఆధ్యాత్మికము :**

కొబ్బరికాయకు, మన శరీరమునకు దగ్గర పోలిక యున్నది.

పీచుతీసిన టెంకాయను పరీక్షిస్తే, మూడుభాగాలుగా ఉంటుంది. అందులో ఒకటి పెద్దభాగము, రెండు చిన్న భాగములు, మూడు భాగములపైన కళ్ళుఉండుట గమనిస్తాము. పెద్దభాగముపైనున్న పొర పలుచగా ఉంటే తేలికగా బెజ్జము పడును. చిన్నభాగాలపైన నున్న కన్నులు గట్టిపొరతో ఉండుటచే రంధ్రము తేలికగా పడదు. మూడు కన్నులుండుటచే టెంకాయను ముక్కంటి అన్నారు.

పెద్దభాగము బ్రహ్మనాడి. ఈ నాడి కంటి కుడి ప్రక్క భాగము సూర్యనాడి. ఎడమ ప్రక్కభాగము చంద్రనాడి. ఈ నాడులపైనున్న కన్నులు ఆయా నాడీ కేంద్రములు. మూడు కళ్ళను (నాడీకేంద్రములను) కలుపుతూ కొబ్బరికాయపై పీచు ఉంచాలి. దీనిని జ్ఞానశిఖ అంటారు. అనగా జ్ఞానమునకు చివర అని అర్థము.

మన శరీరమధ్యలో బ్రహ్మనాడి యున్నది. ఈ నాడికి కుడిప్రక్కన సూర్య నాడి, ఎడమ ప్రక్క చంద్రనాడి యున్నవి. ఈ నాడుల కేంద్రములు తలపైనున్న బ్రహ్మరంధ్రము మాడు ఉండుచోటు. చిన్నపిల్లల తలపై మాడు స్పష్టముగ కనిపించును. సర్వశాస్త్రము తెలిసినవారు, శాస్త్రరూపంలో బహిర్గతమగు నాడులను తెలుసుకోగలరు. యోగము ద్వారా ఈ మూడు నాడులను ఐక్యముచేసిన మానవుడు మహాత్ముడు అవుతాడు.

మన దేహములోని భగవదంశము బ్రహ్మరంధ్రము నుండియే, ప్రాణ వాయువు రూపంలో ప్రవేశించును. మరణించునపుడు ప్రాణము ఈ మార్గము ద్వారానే బహిర్గతమైనవారు భగవంతునిలో ఐక్యమవుతారు. వారికి ఇక జన్మలు లేవు. ఇతర మార్గాలనుండి బహిర్గతమైనవారికి జనన మరణములుండును.

శ్రోత్రియులు, బ్రహ్మనిష్ఠాగరిష్టులగు యోగులు, మునులు, బ్రాహ్మణులు తలంపులు రహితమైనవి. తలపై జుట్టు తీసివేసి మూడునాడులు ఐక్యము

చేసినామని బాహ్యార్థముగ శిఖరూపములో తలపై జుట్టు ఉంచుతారు. శివుడు జటాజూటము ముడివేయుటలో రహస్యమిదియే.

పరమాత్మ స్వరూపమైన టెంకాయను కొట్టి, పరిపూర్ణ జ్ఞానంతో ఉన్నామనే భావంతో జ్ఞానశిఖను తొలగించి నిండు మనస్సుతో చిప్పలను భగవంతునికి సమర్పించాలి.

అందులో శిఖయున్న చిప్ప పరమాత్మ స్వరూపం. శిఖలేనిది జీవాత్మ స్వరూపం. అగ్నినుండి అగ్నికణములు వేరైనట్లు మనము పరమాత్మనుండి వేరైనామనే భావనతో సమర్పించాలి. అందులో కొబ్బరి శుద్ధముగా, తెల్లగా ఉన్నట్లు మన మనస్సులు కూడా తలంపులు లేక శుద్ధముగా ఉన్నాయనే భావనతో ఉండాలి.

## వైజ్ఞానికము :

కొబ్బరి, పాలవలె సంపూర్ణాహారము; చాలా బలవర్ధకమైనది. శరీరమునకు పుష్టి నిచ్చును.

## కొబ్బరినీళ్ళు :

వీనిలో పొటాషియం లవణములు ఉండుటచే సేవించిన శరీరమునకు టానిక్ లాగా శక్తిని ఇచ్చును.

# కదళీవనార్చన - ప్రాశస్త్యము

అతి ఉన్నతమైన మన హైందవ సంస్కృతిలో భగవదారాధనకు, వివాహాది సమస్త శుభకార్యములకు తాంబూలము, అరటిపళ్ళు, వినియోగించుట మన సత్సాంప్రదాయము, శుభప్రదము.

## కదళీవనార్చన :

ఆ మహాతేజస్వి హనుమంతుడు అటవీప్రాంతంవాడు. శాకాహారి. హనుమ కోతి కాడు. కోడులనే ద్రావిడజాతికి చెందినవాడని చరిత్రకారులు కొందరు నిర్ధారణ చేసారు. ఆటవికవాసులు ఆహారం కొరకు అరటి తోటలు పెంచేవారు. అందువలననే స్వామి వారికి కదళీవనార్చన, ఆకుపూజ ఏర్పడినది. వడపప్పు, అప్పాలు మొదలైనవి ఉష్ణాధిక్యాన్ని తగ్గిస్తాయి. బ్రహ్మచారికి ఇవన్నీ అవసరం గనుక ఇవే స్వామి వారికి నైవేద్యాలయ్యాయి.

శ్లో॥ కదళీవన మధ్యస్థం, పూజయేద్యః కపీశ్వరం
తస్యపుణ్యఫలం ప్రోక్తం గుణితం కోటి సంఖ్యయా॥

హనుమత్పూజ అరటి తోటలో చేసినచో అది కోటి రెట్ల ఫలితమునిచ్చును. అరటి పండ్లు నివేదన చేయుట కూడా స్వామికి ప్రీతి పాత్రము.

## అరటి విశిష్టత

**అరటి చెట్టు నీడ :** గాలిని చల్లపరచి శుభ్రపరుచును. ఈ చెట్టు నీడ తాపము, దప్పిక తగ్గించును. కండ్లకు చలువచేయును. నిస్త్రాక తగ్గించును. బలము పుష్టినిచ్చును. వేసవిలో ఈచెట్టు క్రిందపరుండిన మంచి నిద్రపట్టును.

**సర్వరోగనివారిణి అరటిపండు :** భగవదర్పణకు మంచిది. దేవతా ప్రియమైనది. అన్ని ఋతువులలోను, అన్ని ప్రాంతములలోను దొరికే అతి విలువైన పౌష్టికాహారముగలవి అరటిపండ్లు. ధరకూడా అందరకు అందుబాటులో ఉంటుంది. చిన్నపిల్లల దగ్గర నుండి పళ్ళూడిన ముసలివారి వరకు ఎంతో ప్రియమైనవి. అరటిపండ్లు బాగా ముదిరి వాటంతట అవి పండినవి తియ్యగా ఉంటాయి. ఆరోగ్యప్రదము. వీటినే కేళీపండ్లు అంటారు. శక్తి నిచ్చే విటమిన్లు; మినరల్సు, ప్రోటీన్లు, టిష్యూలను పెంపొందించే శక్తులు అరటిపండులో లభ్యమవుతున్నాయి. పాలవలె అరటి పండు కూడ అన్ని పోషకవిలువలను అందిస్తుంది. మేహాన్ని, పైత్యాన్ని తగ్గించి చలువచేస్తుంది. రక్తదోషాలు నివారించును. మంచి వీర్యపుష్టి గలుగజేయును. పొట్టను, ప్రేగులను గొంతును శుభ్రపరుచును. మూత్రపిండములకు సత్తువ గలుగజేసి మలవిసర్జనకు దోహదము చేయును. స్త్రీల రక్తదోషాలు నివారించును. పొడిదగ్గులకు అరటి పండు చాలా ప్రశస్తము. జిగట, రక్తవిరోచనాలకు అరటి పండు, చింతపండు, ఉప్పు కలిపి వాడిన నివారణమగును. అరటిపండ్ల సిరప్ (పానకము) గొంతు జబ్బులకు మంచిది.

**అరటిపువ్వు కూర :** కడుపులోని క్రిములు నశించును. జిగటవిరోచనాలు తగ్గును.

**అరటివేళ్ల రసం :** సెగరోగాన్ని నివారించును. కడుపులోని క్రిములను పోగొట్టును.

**అరటి ఊచ రసం :** రక్తస్రావాన్ని నివారించును.

**దుంప - దూట :** చలువ చేయును. క్రిములను చంపును కుష్ఠరోగము హరించును.

**అరటి ఆకు :** అరటిఆకులో భోజనము వలన వాతము తగ్గి ఆకలి వృద్ధి యగును. శరీరమునకు కాంతి నిచ్చును. వీర్యం చిక్కబడును.

**బొల్లికి :** ఎండు అరటి ఆకులు కాల్చిన బూడిదలో నుండి తీసిన క్షారము పసుపు చూర్ణమును కలిపి సేవించినను పైకి రాసినను బొల్లి పోవును.

## నాగవల్లీ దళార్చన

హనుమదారాధనకు తమలపాకు పూజ ఎంతో ప్రశస్తము, శుభప్రదము.

తమలపాకులు కారము, చేదు, తీపిగలిగి రుచిగ నుండును. ఉష్ణవీర్య మైనవి. వేడిచేయు స్వభావము కలవి. వాత కఫములను హరించును. కంఠ స్వరము బాగు చేయును. విరేచనకారి. జఠరాగ్నివృద్ధి నొందించును. నోటి దుర్వాసన పోగొట్టును. దంత వ్యాధులను హరించును. దగ్గులు రహితమగును.

**పిల్లల ఉబ్బసమునకు :** తమలపాకులకు నూనెరాసి నిప్పులపైన వెచ్చచేసి గుండెలపైనను పొత్తికడుపు పైనను వేసి కాచుచుండిన శ్లేష్మము కరిగి శ్వాస నాళములు శుద్ధమై దగ్గు ఆయాసము తగ్గును. విరేచన మగును. ఈ పద్ధతి విదేశములలో కూడ వాడుచున్నారు.

**కండ్ల జబ్బులకు :** తమలపాకుల తొడిమెల రసమును ఒకటి రెండు చుక్కలు ఉదయము కంటిలో వేసిన నివారించును.

**స్వరభంగమునకు :** తమలపాకు వేరు, మిరియములు కలిపి ముద్దగా కొట్టి అది బుగ్గనుంచుకొని రసమును మ్రింగుచున్న స్వరభంగము గొంతునొప్పులు హరించును.

**మూలవ్యాధులకు :** తమలపాకుల తమ్మిపై పిలకలకు రాసిన బాధ తక్షణమే శమించి పిలకలు రాలిపోవును.

**సంతాన నిరోధమునకు :** తమలపాకులు, మిరియములున్ను ముద్దగానూరి కుంకుడు కాయంత మాత్ర చొప్పున తొమ్మిదిపూటలు సేవించిన సంతాన నిరోధమగును. గర్భకోశమును బలహీన పరుచును.

**పార్శ్వశూలలు :** తమలపాకులకు నూనె రాసి వెచ్చ చేసి కణతలపై వేసిన పార్శ్వశూల కట్టును.

**తాంబూలము :** వాతము శమింపజేయును. కడుపులో క్రిములను పోగొట్టును. కఫము హరించును. స్త్రీ సంభాషణ భూషణము. మలశుద్ధి యగును. నేత్ర రోగములు మానును. సకల క్రిమి రోగములు రహితమగును.

## దేవస్థానములో మనము చేయు సంస్కారములలో వైజ్ఞానిక విలువలు

**1. పాలపొంగళ్ళు :** పాలు, బియ్యం, బెల్లము, పప్పు కలిపి పాయసం వండుతారు. ఇది బలవర్ధకమైన పౌష్టికాహారము.

**పాలు :** సంపూర్ణాహారము. మిక్కిలి పౌష్టిక విలువలు గలది. సప్తధాతువులను పోషించును. వాత, పిత్త, శ్లేష్మ దోషములు పోగొట్టును. వీర్యవృద్ధి చేయును. ముసలితనము త్వరగా రానీయదు. ఆయుర్వేదము ప్రకారము అస్థి, నరములు, మాంసపుకండలు వృద్ధి పొందించును. పాలు, నేయి, తేనె జేర్చి సేవించిన నిస్సత్తువ పోవును. అందుకే పాలను అమృతముతో సమానమన్నారు.

**2. అభిషేకము :** పంచామృత అభిషేకము వేదోక్తమంత్రములతో చేయించిన ఫలసిద్ధియగును. మంత్ర శబ్ద ధ్వని నుండి శబ్దతరంగాలు చెవి నరముల ద్వారా మెదడుకు జేరి అచ్చట నుండి సూక్ష్మశరీరములోని శక్తి కేంద్రములను వికసింప జేయును.

**పంచామృతము :** 1. ఆవుపాలు, పెరుగు, నేయి కలిపి ఒకటి. 2. చక్కెర. 3. తేనె. 4. అరటిపండు. 5. టెంకాయనీళ్ళు. ఈ పదార్థములు అమూల్యమైన ఔషధగుణములు గల పౌష్టికాహార పదార్థములు. వీటిని సేవించిన శరీరపుష్టి గలుగును. అరటిపండు, కొబ్బరినీటి యందు పొటాషియం లవణములుండుటచే అవి శరీరమునకు శక్తినిచ్చు టానిక్ లాంటిది.

**3. ఊయల :** చంటిబిడ్డలకు సాధారణముగా పుట్టిన 21వరోజున ఊయల వేయుదురు. ఊయలలూగుటలో కంటి దోషము పోవును. గుండెకు బలము

నిచ్చును. ఊయలలోపల, పైన వివిధరకములైన బొమ్మలతో అలంకరింతురు. వాటిని చూచుటలో బిడ్డలకు ఆనందము, ఏకాగ్రత కలుగును.

**4. అన్నప్రాశన :** మగబిడ్డకు ఆరవమాసంలోను, ఆడబిడ్డకు అయిదవ మాసంలోను అన్నప్రాశన చేయవలెను. ఆవుపాలతో వండిన పాయసమును బంగారు ఉంగరముతో పెద్దలు బిడ్డ నాలుకపై వ్రాయుదురు. పాయసము పుష్టినిచ్చు బలవర్ధకమైనది. బంగారముతో తాకించుట వలన దాని స్పర్శచే పాకదోషము పోయి మూత్రవిసర్జనము సులభముగా జరుగును. రక్తదోషములు నివారణ మగును. ధర్మామీటరు నాలుక క్రింద పెట్టగానే శరీర ఉష్ణమును లాగుకొనుట లేదా అలాగే బంగారపు స్పర్శ మంచి గుణము నిచ్చును. తల్లి కడుపులోనున్నప్పుడు త్రాగిన మలిన పదార్థముల వలన కలిగిన దోషము రహితమగును.

అన్నము ముట్టించిన పిదప పెన్ను, పుస్తకము, నగలు, రూపాయలు, లడ్డులు బిడ్డల ముందు పెట్టుదురు. వాటిలో బిడ్డలు పట్టుకున్న వస్తువు ననుసరించి బిడ్డవృత్తి, ప్రవృత్తి నిర్ణయిస్తారు.

## చూడాకర్మ, పుట్టువెంట్రుకలు తీయుట :

బిడ్డలకు పుట్టుకతో వచ్చు కేశములు అపవిత్రములు, అపరిశుద్ధములు. అవి తీయించనిచో అధిక ఉష్ణము గలిగి వారికి కురుపులు మొదలగు శరీర రోగములు వచ్చును. తల్లి గర్భమునుండి వచ్చిన వెంట్రుకలు చాలా మృదువుగా నుండును. పుట్టు వెంట్రుకలు తీయించిన వచ్చు జుట్టు పుష్టిగా, దృఢముగా నుండును. వీటివలన బాగా రక్తప్రసరణ జరిగి తేజస్సు, ఉత్సాహము కలిగి ఆయుర్వృద్ధి కలుగును. అందువలన విధిగా పదకొండవ మాసమునగాని, మూడవ సంవత్సరమునగాని జుట్టు తీయించవలెను. పదకొండుమాసముల లోపు తీయించిన మృదువైన బిడ్డ మాడు కత్తి యొక్క స్పర్శసహింపజాలదు.

## కర్ణవేధ - చెవులు కుట్టించుట :

పూర్వము మగబిడ్డలకు, ఆడబిడ్డలకు చెవులు కుట్టించేవారు. రాను రాను మగబిడ్డలకు కుట్టించుట మానేశారు.

శాస్త్రప్రకారము మగబిడ్డలకు కూడా కుట్టించాలి. శరీరమునకు 'చెవి' ప్రాధాన్యతనిస్తుంది. బంగారముతో చెవులు, ముక్కు కుట్టించుట వలన చాలా ఉపయోగములున్నవి. ఉబ్బసము, చెవుడు, మూర్ఛ, రక్తపోటు నివారించును. కంటిచూపుకు మంచిది. స్నానము చేయునప్పుడు బంగారముపై పడిన నీరు శరీరముపై పడుటచే చర్మరోగములు పోవును. మగబిడ్డలకు వరిబీజము, హెర్నియా రాకుండా కాపాడును. బంగారము శరీర ఉష్ణమును సమపాళ్ళలో ఉంచి ఆరోగ్యము కాపాడును.

చెవులు, ముక్కు కుట్టించుకొనటము 'ఆక్యుపంక్చరు' వైద్య విధానములో భాగమని డాక్టరు ప్రభాబోర్యాంక 30-12-1987లో బొంబాయిలో అంతర్జాతీయ గోష్టిలో చెప్పారు.

## నామకరణ :

అన్ని శుభకార్యములకు జన్మనక్షత్రమును బట్టి శుభలగ్నము నిర్ణయిస్తారు. అందువలన జన్మనక్షత్రము, నామనక్షత్రము ఒకటిగా నుండునట్లు వ్యవహార నామమును నిర్ణయించవలయును.

నామకరణ యోగ్యకాలము (కాలామృతమున)

శ్లో॥ జాతానంతరమేవ నామకరణం త్వేకాదశాహైస్స్ఫుటం
పుత్రస్యైవ సమాక్షరంతు యువతేః కార్యంతతోవ్యత్సమే
శుద్ధిర్వాత కవచ్ఛనామ్ని సకలైస్స ద్వాదశేషోడశే
ద్వానింశేవ్య ధవింశకేహ్ని విహితంజాతి వ్యవస్థానంలినా

**భావము :** జాతి వ్యవస్థ లేకుండా అందరకు 11, 12, 16, 20, 22రోజులలో నామకరణము చేయవలయును. పురుషులకు సమానాక్షరములు, స్త్రీలకు బేసి సంఖ్యలో అక్షరములుండునట్లు పెట్టవలెను.

## బృహస్పతి :

శ్లో॥ పూర్వాహ్ణశ్శ్రేష్ఠ ఇత్యుక్తో మధ్యాహ్నో మధ్య మస్స్మృతం
అపరాహ్ణం చరాత్రించ వర్జయే న్నామకర్మణి॥

భావము : అనుప్రమాణముచే పూర్వాష్ణామున చేయుట శ్రేష్ఠము. మధ్యాహ్నాము చేయుట మధ్యమము, సాయాహ్యామున చేయుటగాని, రాత్రియందు చేయుట గాని శ్రేయస్కరము కాదు.

సాధారణముగా పెద్దలు తమ బిడ్డలకు మంత్రయుక్తముగా పెట్టిన నామముతో పిలువక పెద్దబాబు, చిన్నబాబు, బుల్లోడు, బుజ్జిబాబు, టింకు, పింకు, బుజ్జి, చంటి, బుల్లెమ్మ, పెద్దపాప, చిన్నపాప మొదలగు పేర్లతో ముద్దుగా పిలుస్తారు. మంత్రయుక్తముగా పెట్టిన పేరుతో పెద్దలు పిలిచిన వారి వాక్‌బలము మంత్రానుష్టానముగా పనిచేసి వారికి పుష్టిని, శక్తిని యిస్తుంది.

అన్ని శుభకార్యములకు అనగా అన్నప్రాశన, అక్షరాభ్యాసము, గృహ శంఖుస్థాపన, వివాహము మొదలగు సమస్త శుభకార్యములకు జన్మ నక్షత్రమును బట్టి శుభలగ్నము నిర్ణయిస్తారు. జన్మనక్షత్రమునే నామనక్షత్రంగా పెట్టాలి. అంత వరకు ముద్దుపేర్లతో పిలిచి, ఒక లగ్న సమయమున మాత్రం నామనక్షత్రంతో లగ్నము నిర్ణయించిన నామమునకు పెద్దలు పిలుచుటచే వచ్చు వాక్‌బలము లేనందున విఘ్నములు జరిగే అవకాశమున్నది.

అందువలన నిర్ణయించిన శుభలగ్నములు శుభప్రదము కావాలంటే పెద్దలు, పిన్నలు విధిగా బిడ్డలకు పెట్టిన పేరుతో పిలవాలి. అవే వారికి శ్రేయస్సు, సత్యము, నిత్యము.

## హనుమజ్జయంతి

హనుమజ్జయంతి ఉత్సవం ప్రతి ఏటా వైశాఖ బహుళ దశమినాడు అమితోత్సాహంతో, విశేషమైన భక్తి శ్రద్ధలతో జరుపుకుంటాము. భారతావనిలో హనుమంతుని ఆలయము లేని గ్రామము ఉండదనటంలో సందేహం లేదు. మన దేశంలో రామాలయాలు కంటే ఆంజనేయ విగ్రహాలే ఎక్కువగా కనిపిస్తున్నవని చెప్పటం అతిశయోక్తి కాదు.

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క దేవతకు ప్రాధాన్యత కనబడుతుంది. కాని హనుమంతుని ప్రాధాన్యత భారతదేశమంతా వుంది. రామ కార్యసిద్ధి కొరకు శివుడే హనుమంతుడుగా అవతరించాడని పురాణములు ఘోషిస్తున్నాయి. హనుమంతుడు సకల శాస్త్రకోవిదుడు, సర్వశక్తి సంపన్నుడు, ఉత్తమ భృత్యుడు,

ప్రభు భక్తి పరాయణుడు, పరాక్రమానికి, శౌర్యానికి, ధైర్యానికి, ఉన్నతమైన ఆదర్శానికి ఆయన ప్రతీకగా వున్నాడు. భక్తులకు ఆరాధ్య దైవమై వెలసిన మహా మూర్తి శ్రీ హనుమంతుడు.

రామ భక్తాగ్రేసరుడైన హనుమంతుని ఉపాసన ఎంతో శ్రేయోదాయకము. పరమ భక్తాగ్రేసరుడు అయిన ఆంజనేయ స్వామి భక్తులమై పూజించటం భారతీయులమైన మనమందరం అదృష్టవంతులము. శ్రేయోదాయకమైన ఆంజనేయ ఉపాసన భక్తలోకంలో ఎంతో ప్రసిద్ధమైంది.

## హనుమద్దీక్ష

శ్రీహనుమంతుని జనన మాసమైన వైశాఖ మాసము ముఖ్యమగు హనుమద్దీక్ష మాసము అవకాశాన్ని బట్టి ఇతర సమయములందయినను స్వీకరింప వచ్చును. హనుమత్స్వామి జయంతి నాటికి దీక్ష పరిసమాప్తియగునట్లు ఏర్పాటు చేసుకోవాలి. ఇందుకు అనుకూలముగా 40రోజుల ముందు మండల దీక్ష ప్రారంభించాలి. 20 రోజుల ముందు అర్ధమండల దీక్ష ప్రారంభించాలి. దీక్షాస్వీకారము పవిత్రమైన హనుమ దేవాలయములోగాని, గురు గృహమున నైనను చేయవచ్చును. దీక్షావిరమణ మాత్రము హనుమచ్ఛక్తి పూర్ణములగు హనుమక్షేత్రములందు చెయ్యాలి. దీక్షానియమములు చాలా ముఖ్యము.

"హనుమద్దీక్షా విధానము అను గ్రంథము డా॥ అన్నదానం చిదంబర శాస్త్రి గారు, అరేపల్లి అగ్రహారము, గుంటూరు జిల్లా. ఎంతో వివరణ పూర్వకముగా వ్రాశారు. హనుమద్దీక్ష చేసేవారికి సదరు గ్రంథము ఎంతో ఉపయోగము.

## హనుమదారాధకులకు శని బాధ యుండదు

ఒకప్పుడు శని హనుమంతుని పట్టనెంచాడు. ఆంజనేయస్వామి సేతువు వద్ద ధ్యాననిమగ్నుడై యున్నాడు. కండ్లు మూసికొని రామరూపాన్ని మనస్సులో చిత్రించుకున్నాడు. బాహ్య ప్రపంచాన్ని మరచి ధ్యానంలో లీనమయ్యాడు.

అదేసమయంలో సూర్యపుత్రుడైన శనిగ్రహం ఆంజనేయస్వామివారి చేతిని పట్టుకుని యుద్ధానికి రమ్మని కవ్వించాడు. ఆ మహాతేజోవంతుడు హనుమంతుడు శనిని తోకతో చుట్టి వెనుక వ్రేలాడుచుండగా ఈడ్చుకొనుచు సేతుప్రదక్షిణ చేయటంతో శని యొడలు హూనమై, దేహమంతయు పుండ్లు

పడగా హనుమంతుని శరణుజొచ్చాడు. అంత హనుమంతుడు ప్రసన్నుడై తన భక్తుల రాశిలయందు ప్రవేశించినప్పుడు వారిని బాధింపవలదని శాసించి వదలెను. ఆ దేహబాధ భరింపజాలక శని దేహమంతా తైలము పూసుకున్నాడు. అందువలననే శనికి తైలాభిషేకము ప్రీతియైనది. హనుమంతుని సేవించువారికి శని పీడ యుండదు.

## మంగళవార ప్రాశస్త్యము

ఆ మహాతేజోవంతుడు శ్రీరామ ప్రభువు రావణుని హతమార్చి, ఆ సంతోషవార్తను సీతాదేవికి వినుపింపుమని హనుమను ఆజ్ఞాపించినాడు, ఆ రామభక్తుడు హనుమంతుడు ఆవార్తను మహదానందంతో జానకీదేవికి ఎరుకపరచినాడు.

ఆ సీతామాత ఆంజనేయుని నోటినుండి ఆ సంతోషవార్త విని ఎంతో ఆనందించి వీరాధివీరా! హనుమా! సమస్త సద్గుణములు నీయందు నివాస మొనర్చును గాక! మిత్ర సహితుడైన కోసలాధిపతి నీయందెల్లప్పుడు ప్రీతితో నుండుగాక! అని ఆశీర్వదించింది. ఆనాడు మంగళవారమగుటచే తానానాడు విజయ సందేశము విని యుండుటచే ఆ వారమునకు జయవారమని పేరుంచి, ఆ సందేశము తనకు వినిపించిన ఆంజనేయుని మంగళవారము పూజించి సింధూరతిలకం ధరించి, తీర్థ ప్రసాదములు స్వీకరించిన వారికి సర్వకార్యములు సిద్ధించునని సీతామాత వర మొసంగినది.

## శనివారము విశిష్టత

శనివారము ఆంజనేయస్వామి వారి పుట్టినరోజు. ప్రతి శనివారము హనుమను విశేషంగా పూజించి, ఆనాడు ఏకభుక్తంచేసి రాత్రికి ఫలహారం చెయ్యాలి. అట్లు పూజించుట వలన హనుమ ప్రసన్నుడై వారి సర్వకోరికలను తీరుస్తాడని పరాశరమహర్షులవారు చెప్పారు.

## విదేశాలలో హనుమదారాధన

ప్రాచీనకాలం నుండి ఇండోనేషియా, థాయ్‌లాండ్, లాఓస్, కంబోడియా, మారిషస్, బర్మా, జపాను, జర్మనీ మొదలగు అనేక దేశములలో హనుమదారాధన

ఏదో ఒకరూపంలో జరుగుచున్నది. అమెరికా, ఇంగ్లాండు, రష్యా వంటి దేశాలలో కూడా ప్రవాసభారతీయుల వలన హనుమద్విగ్రహములు ప్రతిష్ఠించి పూజించు చున్నారు. మనదేశములో అన్ని రాష్ట్రములలోను ముఖ్యముగా మహారాష్ట్రములో హనుమదారాధన ఘనంగా జరుగుచున్నది.

మహారాష్ట్రములో శివాజి ప్రభువు తన గురువు సమర్ధరామదాసు ప్రోత్సాహముతో రాష్ట్రమంతా వీధి, వీధిన శ్రీ వీరాంజనేయస్వామివారి విగ్రహములు ప్రతిష్ఠించి పూజించారు. నేటికిని మహారాష్ట్రములో హనుమదారాధన వైభవోపేతంగా జరుపుచున్నారు.

## 108 సంఖ్య ప్రాశస్త్యము

జపమాలలో 108 పూసలు. మంత్రానుష్టానములో 108సారులు జపము చేయు రహస్యము.

మన శరీరములో క్రిందనున్న మూలాధారములో మన ప్రాణములు (శ్వాసలు) 108 అంగుళముల కుండలినీశక్తి నాగరూపంలోనున్నది.

### 1. అథేదం శరీరం షణ్ణవత్సం గుణాత్మకం భవతి :

మన శరీరము 96అంగుళముల పొడవు ఉంటుంది. ఎవ్వరికి వారికే అంగుళము బొటనవేలు యొక్క అడ్డుకొలత.

### 2. శరీరాత్ర్పాణో ద్వాదశాంగుళాధికోభవతి :

శరీరము కంటే ప్రాణములు (శ్వాసలు) 12 అంగుళములు ఎక్కువ. 96 + 12 = 108 అయినది.

3. మనము పగలు 108 వందలును, రాత్రి 108 వందలును శ్వాసించుచున్నాము. మొత్తము 21600 అయినది.

| | | | | |
|---|---|---|---|---|
| 4. | కలియుగము | 108 × 4000 | = | 432000 |
| | ద్వాపరయుగము | 108 × 8000 | = | 864000 |
| | త్రేతాయుగము | 108 × 12000 | = | 1296000 |
| | కృతయుగము | 108 × 16000 | = | 1728000 |

అనగా 108 × 40000 = 4320000

అంతయును 108 మీదనే ఆధారపడియున్నది.

5. శుభా, అశుభము మొదలగు సమస్త కార్యములకు వారముకంటే తిథి ముఖ్యము. తిధికంటే నక్షత్రము ముఖ్యము.

మొత్తము నక్షత్రములు 27. ప్రతి నక్షత్రమునకు పాదములు 4.

27 × 4=108 అయినది.

1 + 0 + 8 = 9 పూర్ణసంఖ్య (అదృష్టసంఖ్య)

## హనుమద్వ్రతము

హనుమంతునకు ముఖ్యమగు పర్వదినాలలో ఇది ఒకటి. మార్గశిర శుద్ధ త్రయోదశి, హనుమద్వ్రతం. ఆ దినముననే మారుతి సీతామాతను అశోక వనంలో చూచాడు. ఆరోజు హనుమంతుని పూజించినవారి కోరికలీడేరునని సీతాదేవి వరమొసంగినది.

'మాసానాం మార్గశీర్షో హం' అని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ తానే మార్గశిరమాసమని చెప్పారంటే ఆ మాసం యొక్క విశిష్టత ఎట్టిదో అర్ధమౌతుంది. విశేషించి హనుమంతుని విషయంలో ఈ మాసం ముఖ్యమైనది.

## పంచసంఖ్య

హనుమంతునికి పంచసంఖ్య ఇష్టం కాబట్టి నిత్యం చేసే ప్రదక్షిణాలు, నమస్కారాలు ఐదు చేయాలి. అరటిపండ్లు వంటివి ఐదుసంఖ్యలో సమర్పించుట స్వామికి ప్రీతికరము.

## ఉష్ట్రవాహనము

హనుమంతుని వాహనము ఉష్ట్రము అనగా ఒంటె. స్వామి ధ్వజ చిహ్నము కూడా ఒంటె.





# శ్రీ హనుమాన్ చాలీసా

## దోహా

శ్రీ గురుచరణ సరోజరజ, నిజమనముకుర సుధార్ ।
బరణౌ రఘువర బిమల యశ, జో దాయక ఫలచార ॥

శ్రీ గురుదేవుల పాదపద్మాల పవిత్ర ధూళితో నా మనస్సు అనే అద్దాన్ని చక్కగా కడిగి ధర్మార్థకామమోక్షాలనే నాల్గు ఫలాలను ఇవ్వగల శ్రీరామచంద్రుని నిర్మల యశస్సును వర్ణించటానికి ప్రయత్నించుతాను.

బుద్ధిహీన తను జానికే, సుమిరౌం పవన కుమార్ ।
బలబుద్ధి విద్యా దేహు మోహిం, హరహు కలేశ వికార ॥

నా బుద్ధిహీనతను గుర్తించి ఆంజనేయుని స్మరించుతున్నాను. ఓ పవనపుత్రా, నాకు శక్తిని, బుద్ధిని, విద్యను ప్రసాదించు; నా దోషాలను, వికారాలను తొలగించు.

జయ హనుమాన జ్ఞానగుణసాగర ।
జయ కపీశ తిహులోక ఉజాగర ॥

జ్ఞాన సద్గుణ సాగరమైనటువంటి ఓ హనుమన్మూర్తీ! ముల్లోకాలకు జ్ఞానకాంతినిచ్చే కపీశ్వరా! జయం! జయం!

రామదూత అతులిత బలధామా ।
అంజనిపుత్ర పవన సుతనామా ॥

శ్రీరామునికి దూత ఐనవాడా! సాటిలేని బలానికి నిలయమైనవాడా! అంజనాదేవి కుమారా! వాయుదేవుని పుత్రా!

మహావీర విక్రమ బజరంగీ ।
కుమతి నివార సుమతి కే సంగీ ॥

మహావీరా! పరాక్రమధీరా! వజ్రంలాంటి సుదృఢ దేహంగలవాడా! దుర్బుద్ధిని నశింపచేస్తూ, సద్బుద్ధిని పెంపొందించేవాడా!

కంచన వరణ విరాజసువేశా ।
కానన కుండల కుంచితకేశా ॥

బంగారు కాంతుల మేనిచ్ఛాయవాడా! అతిసుందరమైన వేషధారణం గలవాడా! చెవులకు కుండలాలు ధరించినవాడా! అందంగా ముడిచిన కేశాలు గలవాడా!

హాథ వజ్ర ఔ ధ్వజా విరాజై ।
కాంధే మూంజ జనేవూ సాజై ॥

చేత వస్త్రం, ధ్వజం కలిగి విరాజిల్లుతున్నవాడా! భుజస్కంధాల్లో మౌంజి, జందెములతో ప్రకాశిస్తున్నవాడా!

శంకర సువన కేశరీ నందన।
తేజ ప్రతాప మహాజగవందన ॥

రుద్ర వీర్యోద్భవ రుద్రమూర్తీ! కేసరీతనయుడైన హనుమంతా! గొప్ప తేజోప్రతాపాలున్నవాడా! లోకంచేత పూజింపబడేవాడా!

విద్యావాన గుణీ అతి చాతుర।
రామకాజ కరివేకో ఆతుర॥

విద్యావంతుడా, సద్గుణవంతుడా! బహుచాతుర్యం గలవాడా! రామకార్య నిర్వహణలో సతతం ఆతురత చూపేవాడా!

ప్రభుచరిత్ర సునివేకో రసియా।
రామలఖణ సీతమన బసియా ॥

శ్రీరామచంద్ర ప్రభువు చరిత్రాన్ని వినటంలో రసికత్వం గలవాడా! శ్రీ సీతారామ లక్ష్మణులను హృదయసీమలో ప్రతిష్ఠించుకొన్నవాడా.

సూక్ష్మరూప ధరి సియహి ది ఖావా।
వికట రూప ధరి లంక జరావా॥

సూక్ష్మరూపంతో సీతామాతకు కనిపించావు. వికటరూపం దాల్చి లంకను దహించావు.

భీమరూపధరి అసుర సంహారే।
రామచంద్రకే కాజ సంవారే॥

భీకరాకారం దాల్చి రాక్షసులను సంహరించావు. రామకార్యాన్ని నిర్వర్తించావు.

లాయ సజీవన లఖన జియాయే ।
శ్రీ రఘువీర హరషి వురలాయే ॥

సంజీవని తీసుకువచ్చి లక్ష్మణుణ్ణి రక్షించినావు. అందుకు శ్రీరాముడు సంతసించి తన హృదయానికి హత్తుకొన్నాడు.

రఘుపతి కీన్హీ బహూత బడాయీ।
తుమ మమ ప్రియ భరత హి సమభాయీ॥

శ్రీరాముడు ఎంతో ప్రశంసించి "నువ్వు నాకు ప్రియమైన భరతుడితో సమానమైనవాడివి" అన్నాడు.

సహస వదన తుమ్హ రో యశగావై।
అస కహి శ్రీపతి కంఠ లగావై॥

గానంచేసి శ్రీరాముడు నిన్ను ఆలింగనం చేసుకొంటూ, 'ఆదిశేషువు కూడా నీ కీర్తిని వేనోళ్ళ గానం చేస్తున్నాడు' అన్నాడు.

సనకాదిక బ్రహ్మాది మునీశా।
నారద శారద సహిత అహీశా ॥

సనక సనందనులు, బ్రహ్మ మొదలైనవారు, మునీశ్వరులు, నారదుడు, సరస్వతి, ఆదిశేషుడు...

యమ కుబేర దిగపాల జహాఁతే ।
కవి కోవిద కహి సకై కహాఁతే ॥

యమ, కుబేర ఆదిగాగల దిక్పాలకులు, కవులు, పండితులు మొదలైనవారు నీ కీర్తిని గానం ఎలా చెయ్యగలరు?

తుమ ఉపకార సుగ్రీవహిం కీన్హా ।
రామ మిలాయ రాజపద దీన్హా ॥

నువ్వు సుగ్రీవుడికి ఉపకారం చేశావు. శ్రీరామునితో స్నేహం కల్పించి సుగ్రీవుడికి రాజపదవిని యిప్పించావు.

తుమ్హా రో మంత్ర విభీషణ మానా ।
లంకేశ్వర భయే సబ జగజానా ॥

విభీషణుడు నీ సలహాను పాటించడం వలన లంకాధిపతి అయ్యాడనే విషయం జగత్ప్రసిద్ధమే గదా!

యుగ సహస్ర యోజన పర భానూ।
లీల్యో తాహి మధుర ఫల జానూ॥

రెండువేల యోజనాల దూరంలోవున్న సూర్యుణ్ణి మధురమైన పండుగా తలచి లీలగా స్పృశించావు.

ప్రభు ముద్రికా మేలి ముఖ మహీ।
జలధి లాంఘిగయే అచరజ నాహీ॥

శ్రీరామచంద్రుని ముద్రికను నోట వుంచుకొని సముద్రాన్ని లంఘించి నావంటే ఆశ్చర్యం ఏముంది?

దుర్గమ కాజ జగతకే జేతే
సుగమ అనుగ్రహ తుమ్హ రే తేతే॥

లోకంలో దుర్గమమైన ఏ కార్యమైనా నీ అనుగ్రహంతో సుగమం అవుతుంది.

రామ దుఆరే తుమ రఖవారే।
హోతన అజ్ఞా బిను పైసారే॥

నువ్వు శ్రీరాముని వాకిలి కాచేవాడవి. నీ అనుమతి లేకుండా లోనికెళ్ళటం వీలుపడదు.

సబ సుఖ లహై తుమ్హారీ సరనా।
తుమ రక్షక కాహూ కో డరనా॥

నిన్ను శరణు వేడితే సర్వసౌఖ్యాలు చేకూరుతవి. నీ రక్షణలో ఎవరూ భయపడవలసిన అవసరంలేదు.

ఆపన తేజ సమ్హారో ఆపై।
తీనోం లోకహాంకతే కాంపై॥

నీ తేజస్సును నువ్వే నిభాయించుకోగలవు. నీకు ముల్లోకాలు గడగడ లాడతాయి.

భూత పిశాచ నికట నహి ఆవై।
మహావీర జబ నామ సునావై॥

మహావీరా! నీ పేరు వింటేనే భూతప్రేత పిశాచ గణాలు సమీపించలేవు.

నాశై రోగ హరై సబ పీరా।
జపత నిరంతర హనుమత వీరా॥

వీరహనుమంతుణ్ణి సదా జపిస్తే సర్వరోగాలు నయమవుతాయి, పీడలు తొలగిపోతాయి.

సంకట సే హనుమాన ఛుడావై।
మన క్రమ బచన ధ్యాన జో లావై॥

మనోవాక్కాయాలతో ఎవరు హనుమంతుణ్ణి ధ్యానిస్తారో వారిని అతడు అన్ని కష్టాలనుంచి కాపాడతాడు.

సబ పర రామ తపస్వీ రాజా।
తినకే కాజ సకల తుమ సాజా॥

రాజులందరికీ శ్రీరాముడు కిరీటం వంటివాడు. తపస్సంపన్నులకు ప్రభువు వంటివాడు. నువ్వు రామకార్యాలన్నింటిని సక్రమంగా నెరవేరుస్తుంటావు.

ఔర మనోరథ జోకో ఇలావై।
నోయి అమిత జీవన ఫల పావై॥

(హనుమంతుని భక్తులు) మనోరథాలన్నీ పొందటమేగాక, శాశ్వతానంద దాయకమైన మోక్షఫలాన్ని కూడా పొందుతారు.

చారో యుగ పరాతాప తుమ్హా రా।
హై పరసిద్ధ జగత ఉజియారా ॥

నీ ప్రతాపం నాల్గుయుగాల్లోను ప్రసిద్ధం. నీ కీర్తి ప్రపంచమంతా ఉజ్వలంగా ప్రకాశిస్తోంది.

సాధు సంత కే తుమ రఖవారే।
అసుర నికందన రామ దులారే॥

సాధువులనూ, సజ్జనులనూ రక్షిస్తుంటావు. రాక్షసులను సంహరించి శ్రీరామునికి ప్రేమస్పదుడవైనావు.

అష్టసిద్ధి నవ నిధి కే దాతా।
అస వర దీన జానకీమాతా॥

అణిమాద్యష్టసిద్ధులను, నవనిధులను సంప్రాప్తింపచేసేవాడివి. అదే వరాన్ని సీతాదేవి నీకు ఒసగివుంది.

రామ రసాయన తుమ్హ రే పాసా।
సదా రహో రఘుపతి కే దాసా॥

నీ వద్ద రామరసాయనం వుంది. నువ్వు శ్రీరామునికి నమ్మిన బంటువు.

తుమ్హ రే భజన రామకో పావై।
జన్మ జన్మకే దుఃఖ బిసరావై॥

నిన్ను (మేము) సేవించటం, శ్రీరామునికి సంతోషం కలిగిస్తుంది. జన్మజన్మాంతరాల దుఃఖాన్ని ఉపశమింపచేస్తుంది.

అంతకాల రఘుపతి పురజాయీ।
జహాఁ జన్మ హరిభక్త కహాయీ॥

నీ భక్తుడు చనిపోయి రామలోకాన్ని పొంది, హరి భక్తుడుగా జన్మిస్తాడు.

ఔర దేవతా చిత్త న ధరయీ।
హనుమత సేయి సర్వసుఖకరయీ॥

ఇతర దేవతలను మనస్సులో తలచుకోక, హనుమంతుణ్ణే సేవిస్తే, సర్వశుభాలను ప్రసాదిస్తాడు.

సంకట హరై మిటై సబవీరా।
జో సుమిరై హనుమత బలవీరా॥

బలవంతుడూ, వీరుడూ ఐన హనుమంతుణ్ణి ఆరాధిస్తే, కష్టాలన్నీ, పీడలన్నీ తొలగిపోతాయి, పటాపంచలైపోతాయి.

జైజైజై హనుమాన గోసాయీ।
కృపాకరో గురుదేవకీ నాయీ॥

ఓ ఆంజనేయా! నీకు జయమగుగాక; ఓ గురుదేవా, మమ్మల్ని అనుగ్రహించు.

జోహ శత బార పాఠ కర జోయీ।
ఛూటహి బంది మహాసుఖ హోయీ॥

ఈ 'హనుమాన్ చాలీసా' ను నూరుమార్లు ఎవరు పారాయణం చేస్తారో వారు బంధాల నుండి విడివడి సౌఖ్యాన్ని పొందుతారు.

జో యహ పఢై హనుమాన చాలీసా।
హోయసిద్ధి సాఖీ గౌరీసా॥

అతిప్రశస్తమైన యీ 'హనుమాన్ చాలీసా'ను ఎవరు పారాయణం చేస్తారో వారు పార్వతీ పరమేశ్వర సాక్షిగా సిద్ధిపొందుతారు.

తులసీదాస సదా హరిచేరా।
కీజై నాథ హృదయ మహ డేరా॥

భక్తుల్లో అగ్రగణ్యుడైన తులసీదాసు ఎప్పుడూ శ్రీహరికి దాసుడే! ఓ ప్రభూ! నువ్వు నా హృదయసీమలో నివసించు.

## దోహా

పవనతనయ సంకట హరన మంగళ మూరతి రూప।
రామలఖన సీతాసహిత హృదయ బసహు సురభూప॥

సంకట నాశకుడు, మంగళరూపుడు, దేవతాధిపతీ, పవనతనయుడు ఐన నువ్వు శ్రీ సీతారామ లక్ష్మణునితో కూడి సదా నా హృదయంలో ఆసీనుడవు కమ్మని ప్రార్థిస్తూన్నాను.

# పారాయణ విధానం

పూజా మందిరాన్ని పరిశుభ్రం చేసుకొన్నాక, ఒక నేతి దీపాన్ని వెలిగించాలి. ప్రశాంతంగా కూర్చుని హనుమాన్ చాలీసాను పదకొండుమార్లు పారాయణం చేయాలి. లెక్కకు పువ్వులను తీసుకోవచ్చు. ఒకసారి పారాయణ పూర్తికాగానే ఒక పువ్వును హనుమంతుడి చిత్రపటానికి సమర్పించండి. ఈ కార్యం ఒక ఆలయంలోనో లేక పరిశుభ్రమైన గది మూలనోకూడా చేయవచ్చును. రావి చెట్టును ప్రదక్షిణచేస్తూ నూరుసార్లు హనుమాన్ చాలీసాను పారాయణ చేయ వచ్చును. ఈ పారాయణ మంగళ లేక శనివారాలలోగాని లేక ఆ రెండు రోజులలో గాని చేయవచ్చును. హనుమంతుణ్ణి మనసారా ధ్యానించండి; ఆయన పేర బ్రహ్మచర్యాన్ని పాటించండి. ఆయన కరుణాకటాక్షాలతో సర్వం సిద్ధిస్తుంది.





# శ్రీ ఆంజనేయ దండకము

శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం, ప్రభాదివ్యకాయం ప్రకీర్తి ప్రదాయం, భజే వాయుపుత్ర, భజే వాలగాత్రం భజేహం పవిత్రం భజే సూర్యమిత్రం, భజే రుద్రరూపం, భజే బ్రహ్మతేజంబటంచున్, ప్రభాతంబు సాయంత్రము నీన్నామ సంకీర్తనల్‌చేసి, నీరూపు వర్ణించి నీమీద నేదండకం బొక్కటింజేయ నూహించి, నీమూర్తి గావించి, నీరూపు సుందరంబెంచి నీ దాసదాసుండనై, రామభక్తుండనై, నిన్ను నే గొల్చెదన్, నీ కటాక్షంబున్ జూచితే వేడుకల్ జేసితే నా మొరాలించితే, నన్ను రక్షించితే, యంజనాదేవి గర్భాన్వయాదేవ, నిన్నెంచ నేనెంతవాడన్, దయాశాలివై జూచితే దాతవై బ్రోచితే తొల్లి సుగ్రీవుకున్ మంత్రివై స్వామి కార్యార్థివై యేగి శ్రీరామ సౌమిత్రులం జూచి వారిన్విచారించి సర్వేశుబూజించి యబ్భానుజం బంటుగావించి యవ్వాలినిన్ జంపి కాకుస్థ తిలకుం దయాదృష్టి వీక్షించి కిష్కింద కేతెంచి శ్రీరామ కార్యార్థమై లంకకేతెంచి యాలంకిణిన్ జంపి, యాలంకనుం గాల్చి, యాభూమిజన్ చూచి యానంద ముప్పొంగి, యాయుంగరంబిచ్చి యా రత్నమున్ దెచ్చి శ్రీరాముకున్నిచ్చి సంతోషమున్‌జేసి, సుగ్రీవుని న్నంగదున్ జాంబవంతున్నలున్నీ లురంగూడి యా సేతువుందాటి యావానరల్ మూకలై గూడి పెన్మూకలై దైత్యులంద్రుంచగా రావణుం దంతకాలాగ్ని రుద్రుండుగావచ్చి

బ్రహ్మాండమైనట్టి యాశక్తినిన్ వైచి యాలక్ష్మణున్ మూర్ఛనొందింపగా నప్పుడే పోయి సంజీవినిన్ దెచ్చి సౌమిత్రికినిచ్చి ప్రాణంబు రక్షింపగా! కుంభకర్ణాదులు న్వీరులుఁబోర శ్రీరామ బాణాగ్ని వారందరన్ రావణుంజంపగా నంతలోకంబు లానందమైయుండ నవ్వేళనున్ విభీషణున్ వేడుకన్ దోడుకన్ వచ్చి పట్టాభి షేకంబు జేయించి సీతామహాదేవినిన్ దెచ్చి శ్రీరామునకున్నిచ్చి యంతన్న యోధ్యాపురిన్‌జొచ్చి పట్టాభిషేకంబు సంరంభమైయున్న నీకన్న నాకెవ్వరున్ గూర్మిలేరంచు మన్నించి శ్రీరామభక్తి ప్రశస్తంబుగా నిన్ను సేవించి నీ నామ సంకీర్తనన్ చేసినన్ బాపముల్ బాయవే భయంబులున్ దీరవే భాగ్యముల్ గల్గు సామ్రాజ్యముల్ గల్గు సంపత్తులన్ గల్గు నో వానరాకార యోభక్తమందార! యోపుణ్య సంచార! యోధీర యోవీర నీవే సమస్తంబుగా వెలసి యా తారక బ్రహ్మమంత్రంబు పఠించుచున్ స్థిరముగా వజ్ర దేహంబునుందాల్చి నీ దీర్ఘ దేహంబు నాజిహ్వనుందాల్తు త్రైలోక్యసంచారివై రామ నామాంకిత ధ్యానివై బ్రహ్మవై బ్రహ్మతేజంబునన్ వెలుగునో రౌద్ర విజ్వాలకల్లోలహావీర హనుమంత యోంకార శబ్దంబులం భూతప్రేతంబులన్ జెన్ పిశాచంబులన్‌శాకినీ డాకినీ త్యాదులం గాలిదయ్యంబులన్ నీదు వాలంబునన్ జుట్టి నేలంబడగొట్టి నీ ముష్టిఘాతంబులన్ బాహు దండంబులన్ రోమఖండంబులం ద్రుంచి కాలాగ్ని రుద్రుండవౌ నీవు బ్రహ్మ ప్రభా భాసితంబైన నీ దివ్య తేజంబునుంజూపి రారోరి నాముద్దు నరసింహ యంచుం దయాదృష్టి వీక్షించి నన్నేలు నా స్వామి యోయాంజ నేయా నమః సదా బ్రహ్మచారీ వ్రతపూర్ణ హరీ! నమస్తే నమో వాయుపుత్రా నమస్తే నమః॥



# మంగళాష్టకమ్

శ్లో॥ వైశాఖేమాసి కృష్ణాయాం దశమ్యాం మందవాసరే
పూర్వాభాద్రా ప్రభూతాయమంగళం శ్రీ హనూమతే ॥

కరుణారసపూర్ణయ ఫలాపూవ ప్రియాయ చ ।
మాణిక్యహారకంఠాయ మంగళం శ్రీ హనూమతే ॥

సువర్చలాకళత్రాయ చతుర్భుజధరాయ చ।
ఉష్ట్రారూఢాయ వీరాయ మంగళం శ్రీ హనూమతే ॥

దివ్యమంగళ దేహాయ పీతాంబరధరాయ చ।
తప్తకాంచనవర్ణాయ మంగళం శ్రీ హనూమతే ॥

భక్త రక్షణ శీలాయ జానకీ శోకహారిణే।
జ్వల త్పావకనేత్రాయ మంగళం శ్రీ హనూమతే ॥

పంపాతీర విహారాయ సౌమిత్రి ప్రాణదాయినే
సృష్టికారణభూతాయ మంగళం శ్రీ హనూమతే ॥

రంభావన విహారాయ గంధమాదవాసినే ।
సర్వలోకైకనాథాయ మంగళం శ్రీ హనూమతే ॥

పంచాననాయ భీమాయ కాలనేమి హరాయ చ।
కౌండిన్యగోత్ర జాతాయ మంగళం శ్రీ హనూమతే ॥

ధన్యోఽహంకృతకృత్యోఽహం
పుణ్యోఽహం వాయునంద

అద్య మే సఫలం జన్మ
భవ త్పాదాబ్జవందనాత్

# శ్రీ హనుమత్సూక్తం

శ్రీమాన్, సర్వలక్షణ సంపన్నః, జయప్రదః, సర్వాభరణభూషితముదారం, మహోన్నతోష్ట్రమారూఢః కేసరీప్రియనందనః వాయుతనూజః, యధేచ్ఛ పంపాతీర విహారే, గంధమాదన సంచారః, హేమప్రాకారాంచిత కనక కదళీవనాంతర నివాసీ పరమాత్మ, వనచరశాపవిమోచనః, హేమవర్ణాం నానారత్న ఖచితా మమూల్య తరాం మేఖలాం చ స్వర్ణోపవీతాం కౌశేయవస్త్రం చ బిభ్రాణః, సనాతనః, పరమ పురుషః, మహాబలః, అప్రమేయ ప్రతాపశాలీ, రజితవర్ణః, శుద్ధ స్ఫటిక సంకాశః; పంచవదనః, పంచదశనేత్రః, సకల దివ్యాస్త్రధారీ, శ్రీ సువర్చలా రమణః. మహేంద్రాద్యష్ట దిక్పాలక త్రయస్త్రింశద్గీర్వాణ మునిగణ గంధర్వ యక్ష కిన్నెర పన్నగాసురపూజిత పాదపద్మయుగళః, నానావర్ణః, కామరూపః, కామాచారః, యోగిధ్యేయః, శ్రీ హనుమాన్, అంజనేయో, విరాడ్రూపీ, విశ్వాత్మా, విశ్వరూపః, పవననందనః, పార్వతీపుత్రః. ఈశ్వరతనూజః, సకల మనోరథాన్నో దదాతు,

**ఫలశ్రుతి :**

వ. ఇదం శ్రీ హనుమత్సూక్తం యోధీమానేకవాదం పఠేద్యది సర్వేభ్యః పాపేభ్యో విముక్తో భూయాత్.





# హనుమత్కళ్యాణములు

### మచిలీపట్నం, పరాసుపేటలో శ్రీ సువర్చలా సమేత ఆంజనేయస్వామి ప్రసిద్ధ దేవళం

## స్థలపురాణం

ఇండియా (భారతదేశంలో), ఆంధ్రప్రదేశ్‌లో, కృష్ణాజిల్లాలో, మచిలీపట్నం, పరాసుపేటలో శ్రీ సువర్చలాసమేత ఆంజనేయస్వామి ప్రసిద్ధ దేవళం ఉంది. ఆలయ ప్రతిష్ఠ ఛత్రపతి శివాజీ గురువయిన శ్రీ సమర్ధరామదాస స్వామిచే 1653లో చేయబడినట్లు లిఖిత ప్రమాణముంది. ఇంకా విశేషమేమన నడిచే దైవంగా ప్రసిద్ధులైన శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి (కంచి పెద్ద స్వామి) వారు 1969వ సంవత్సరములో మచిలీపట్నం వేంచేశారు. వారు ఒకనాటి రాత్రి పీఠస్థానము నుండి బయలుదేరి నడువనారంభించారు. శిష్యులు వెంట వెళ్ళారు. అలా వెళ్ళిన స్వామి నేరుగా శ్రీ సువర్చలాంజనేయాలయానికి వెళ్ళి ఆ రాత్రి అక్కడే నిద్ర చేసారు. అప్పటికి తెలిసింది పురజనులకు ఆ ఆలయ విశిష్ఠత. వెంటనే పునరుద్ధరణ చేపట్టారు. ప్రస్తుతం గొప్పగా ఆలయం నిర్వహింపబడుతోంది. ఆ ఆలయములో యంత్రముపైననే శ్రీ సువర్చలాంజనేయ లోహ మూర్తులు పోత పోసి ఉంటాయి.

ఇండియాలో ఆంధ్రప్రదేశ్‌లో, కృష్ణాజిల్లాలో బంటుమిల్లికి రెండు కిలోమీటర్ల దూరంలోని పాశ్చాపురంలో శ్రీ సువర్చలాంజనేయ కృష్ణ శిలామూర్తులు

ఉన్నాయి. అవి స్వయంవ్యక్తమూర్తులుగా ప్రతీతి. పై రెండుచోట్ల ప్రతి సంవత్సరం కళ్యాణములు జరుగుతాయి.

ఇండియాలో, ఆంధ్రప్రదేశ్‌లో, తూర్పు గోదావరి జిల్లా గంద్రేడులో శ్రీ సువర్చలాసహిత ఏకాదశముఖ వీరాంజనేయ స్వామి ఉన్నారు. అక్కడ శాశ్వత నిత్యకళ్యాణ వ్యవస్థ శ్రీ సువర్చలాంజనేయకేర్పాటు చేయబడింది. అట్లే రాజమండ్రి కవలగొయ్యలో కూడ.

హనుమత్ కళ్యాణములు విశేషంగా జరిగేతావులెన్నో ఉన్నాయి. హైదరాబాదు - తాడుబందు వీరాంజనేయాలయంలో జరిగే కళ్యాణోత్సవాలు ప్రసిద్ధమైనవి. అలాగే దిల్‌సుఖ్‌నగర్‌వంటి చోట్ల జరుగుతాయి. ప్రముఖ హనుమదుపాసకులంతా హనుమత్ కళ్యాణ నిర్వాహకులే. విశేషించి ప్రకాశం జిల్లా పావులూరులో ప్రతి సంవత్సరము కొన్ని వందలమంది దంపతులు కూర్చొని సామూహిక కళ్యాణములు నిర్వహిస్తారు. అందుకై ప్రతి ఏటా వందలాది మృణ్మయమూర్తులకు ఆర్డరిస్తారు. పశ్చిమ గోదావరి జిల్లా ఏల్పూరులో 1000 కళ్యాణములు జరిగాయట. మద్రాసు, కుమరన్ నగర్‌లో శ్రీ హనుమద్దాసుగారి ఆధ్వర్యములో శ్రీ సువర్చలా హనుమత్కళ్యాణ నిర్వహణ జరుగుతుంది. వారు సువర్చలా హనుమన్మంత్ర గాయత్ర గాయత్రి ఉపదేశించి వివాహం కాని వారికయే భాగ్యం కల్గించారట. కాగా మూలవిరాట్ ఉత్సవమూర్తులుకల వేలాది ఆలయాలలో కళ్యాణాలు జరిగే విషయం ప్రత్యేకించి చెప్పపనిలేదు.

రిమ్మనపూడి, వీరాంజనేయపురం, పామర్రు, బొమ్మలూరు గ్రామములలో ప్రసిద్ధ ఆంజనేయ స్వామి దేవాలయములలో ప్రతి సంవత్సరము కళ్యాణ మహోత్సవములు రంగ రంగ వైభవోపేతముగా జరుగును.



## ఆంజనేయస్వామి అవతారములు, కొన్ని ప్రసిద్ధ దేవాలయ ప్రదేశములు

| | | |
|---|---|---|
| 1. | పంచముఖ ఆంజనేయస్వామి | (వెంకటేశన్ పి. & టి. కాలనీ) |
| 2. | యోగ ఆంజనేయస్వామి | (మదనపల్లిలో, చిత్తూరు జిల్లా, ఆం.ప్ర) |
| 3. | అభయ ఆంజనేయస్వామి | (సాతులూరులో, నరసరావు పేటకు 6 కిలోమీటర్లు, గుంటూరు జిల్లా, ఆం.ప్ర) |
| 4. | వీరాంజనేయ స్వామి | (భూమానంద ఆశ్రమము, పీఠాధిపతి మాతా ప్రతిభానందగిరి, వీరన్నగట్టుపల్లె పోష్టు, గండి క్షేత్రము, కడపజిల్లా) |
| 5. | భక్త ఆంజనేయస్వామి | (బొమ్ములూరు, బాపులపాడు మండలం, కృష్ణాజిల్లా) |
| 6. | ఆంజనేయస్వామి | హనుమాన్ జంక్షన్ |
| 7. | బేడి ఆంజనేయస్వామి | (షోలింగవరము, చెంగల్పట్టు జిల్లా చెన్నైకి 150 కిలోమీటర్లు దూరం, మరియు శ్రీ వెంకటేశ్వరస్వామి ముఖమంటపమునకు ఎదురుగా, ధర్మప్రచార పరిషత్‌కు ప్రక్కన, తిరుమలలో) |
| 8. | ఆంజనేయస్వామి | ఉంద్రపూడి, పామర్రు మండలము, కృష్ణాజిల్లా, ఆం.ప్ర |
| 9. | ఆంజనేయస్వామి | వీరాంజనేయపురం, పామర్రు మండలము, కృష్ణాజిల్లా, ఆం.ప్ర |
| 10. | ఆంజనేయస్వామి | (భీమేశ్వరాలయము దగ్గర, గుడివాడలో, కృష్ణాజిల్లా ఆంధ్రప్రదేశ్ 1718లో నిర్మితము, సంజీవి పర్వతము స్వామివారి కుడి హస్త మందున్నది. ఆ విధముగా మరెచ్చటను కానరాదు). |
| 11. | ఆంజనేయస్వామి | సామర్లకోట, తూర్పు గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్ |

| | |
|---|---|
| 12. ఆంజనేయస్వామి | పెందుర్తి, పెందుర్తి మండలము, విశాఖపట్నం జిల్లా, ఆంధ్రప్రదేశ్ |
| 13. కపిల ఆంజనేయస్వామి | తిరుపతి బస్సుస్టాండు దగ్గర ఉత్తర దిక్కున, గరుత్మంతుడు దక్షిణ దిక్కున ఒకే రాతిలో రెండు ఇమిడి యున్నవి. |
| 14. చిట్టి ఆంజనేయస్వామి | తెనాలి |
| 15. ఆంజనేయస్వామి | కరళాడా తాండా, కొత్త చెఱువు మండలము, అనంతపురం జిల్లా |
| 16. ఆంజనేయస్వామి | గోరంట్ల, గోరంట్ల మం॥, అనంతపురం జిల్లా |
| 17. ఆంజనేయస్వామి | పెదముత్తేవి, కృష్ణాశ్రమము, కృష్ణాజిల్లా, ఆం.ప్ర |
| 18. ఆంజనేయస్వామి | బైపాస్‌రోడ్డులో, గుంటూరు, ఆంధ్రప్రదేశ్ |
| 19. ఆంజనేయస్వామి | దుగ్గిరాల, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్ |
| 20. ఆంజనేయస్వామి | బెంజి సర్కిల్ ప్రక్కన, విజయవాడ |
| 21. ఆంజనేయస్వామి | కడియం, తూర్పు గోదావరి జిల్లా, ఆం.ప్ర |
| 22. ఆంజనేయస్వామి | బుచ్చిమ్మగారి మఠం, పామర్రు మండలం, కృష్ణాజిల్లా |
| 23. ఆంజనేయస్వామి | కడియం దగ్గర, తూర్పుగోదావరి జిల్లా, ఆం.ప్ర |
| 24. ఆంజనేయస్వామి | భీమడోలు దగ్గర, పశ్చిమ గోదావరి జిల్లా, ఆం.ప్ర |
| 25. ఆంజనేయస్వామి | బనసవాడి, బెంగుళూరు సిటి |
| 26. ఆంజనేయస్వామి | కాసాపురము, గుంతకల్లు దగ్గర, అనంతపురం జిల్లా |
| 27. ఆంజనేయస్వామి | ములబాగల్ పలమనేరు - బెంగుళూరు హైవే పైన 40 కిలోమీటర్ల దూరం, కర్ణాటక రాష్ట్రం) |
| 28. ఆంజనేయస్వామి | నూజివీడు, కృష్ణాజిల్లా |
| 29. ఆంజనేయస్వామి | నవ అవతార క్షేత్రము, మంగమూరిడొంక, ఒంగోలు |

| | |
|---|---|
| 30. దాసాంజనేయస్వామి | మాచవరం డౌను, విజయవాడ |
| 31. అంజనేయస్వామి | ఈడేపల్లి, మచిలీపట్నం |
| 32. అంజనేయస్వామి | వెంకటేశ్వరస్వామి గుడివెనుక వైపు, గుడివాడ |
| 33. వీరాంజనేయస్వామి (భారీ విగ్రహము) | పొన్నూరు, గుంటూరు జిల్లా |
| 34. అంజనేయస్వామి | బొప్పుడి, చిలకలూరిపేట మండలం, గుంటూరు జిల్లా |
| 35. అంజనేయస్వామి | హనుమాన్ ఘాట్, కాశి |
| 36. అంజనేయస్వామి | మద్ది, |
| 37. అంజనేయస్వామి | ఉయ్యూరు, కంకిపాడు మండలం, కృష్ణాజిల్లా |
| 38. అంజనేయస్వామి అలయం | సుల్తానగరము, బందరు మండలము, కృష్ణాజిల్లా |
| 39. అంజనేయస్వామి అలయము క్షేత్రపాలకుడు | పాండురంగ దేవాలయము, మచిలీపట్నం |
| 40. అంజనేయస్వామి ఆలయము | పత్తుల్లాబాదు, బందరు మండలం, కృష్ణాజిల్లా |
| 41. పంచముఖ అంజనేయస్వామి | తూర్పువీధి, ఏలూరు, ప॥ గో॥ జిల్లా |
| 42. అంజనేయస్వామి (భారీ విగ్రహము) | కారంచేడు, గుంటూరు జిల్లా |
| 43. అంజనేయస్వామి (భారీ విగ్రహము) | అలహాబాదు |
| 44. అంజనేయస్వామి | మధురానగర్, హైదరాబాద్ |
| 45. అంజనేయస్వామి | సత్యసాయి కళ్యాణమంటపము, హైద్రాబాద్ |
| 46. అంజనేయస్వామి | దత్తాశ్రమము, మంగినపూడి, బందరు మండలం, కృష్ణాజిల్లా |
| 47. శ్రీ సువర్చలాసమేత అంజనేయస్వామి ప్రతిష్ఠించినవారు రామదాసు | పరాసుపేట, (ఫ్రెంచిపేట) |
| 48. శ్రీ వాలపూజా బాలహనుమాన్ మందిరము | బచ్చుపేట, మచిలీపట్నం, కృష్ణాజిల్లా |

| | |
|---|---|
| 49. ఆంజనేయస్వామి | రిమ్మనపూడి, పామర్రు మండలం, కృష్ణాజిల్లా |
| 50. ఆంజనేయస్వామి - 61' | గోకవరం, రంగంపేట మం॥, తూ॥గో॥ జిల్లా |
| 51. ఆంజనేయస్వామి - 54' | మండపము కట్టడము సామర్లకోట |
| 52. అభయ ఆంజనేయ - 61' | పెందుర్తి, పెందుర్తి మండలము, విశాఖపట్నం జిల్లా |
| 53. ఆంజనేయస్వామి రాతివిగ్రహం - 41' | బైపాస్ రోడ్, గుంటూరు. |
| 54. ఆంజనేయస్వామి (ఫేమస్) | అయోధ్య |
| 55. శ్రీ ప్రసన్న వీరాంజనేయగుడి | మహాలక్ష్మి లే-అవుట్, బెంగుళూరు |
| 56. శ్రీ ప్రసన్న వీరాంజనేయ | రాగిగుట్ట, జె.పి. నగర్, బెంగుళూరు |
| 57. ఆంజనేయస్వామి విగ్రహము | ప్రశాంతి నిలయము స్టేడియం, పుట్టపర్తి, అనంతపురం జిల్లా |
| 58. ఆంజనేయస్వామి ఆలయము | లేపాక్షి |
| 59. శ్రీ ఆంజనేయస్వామి ఆలయము | వైష్ణవి దేవాలయము దగ్గర, జమ్ము |
| 60. ఆంజనేయస్వామి ఆలయము | చల్లపల్లి, కృష్ణాజిల్లా. |
| 61. గాలి ఆంజనేయ స్వామి | మైసూరు రోడ్డు, బెంగుళూరు |
| 62. ఆంజనేయ స్వామి ఆలయము | బనస్వాడి , బెంగుళూరు |
| 63. కోట ఆంజనేయస్వామి | సిటి మార్కెట్టు, బెంగుళూరు |
| 64. తుప్ప (నెయ్యి) ఆంజనేయ స్వామి | బలేపేట, బెంగుళూరు |
| 65. రామ ఆలింగన ఆంజనేయస్వామి | హనుమంతనగర్, బెంగుళూరు |

